

ప్రజభామిని

2, 3 కవరుపేజీలు చిత్రకారుడు : కల్యాణప్రసాదశర్మ—విజయనగరం.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder · K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 37
18.5-55

మన్మథ వైశాఖ బహుళ ఏకాదశి బుధవారం



ప్రాగస్సు

—ఫోటో: ఎస్. టి. చారి, రాజమండ్రి.

## కాంబోడియా కబుర్లు 14:

# మాఘమాసం

శ్రీకొవ్విడి లక్ష్మన్న

కాంబోడియాలో మాఘమాసం పండుగులకి పెట్టిందిపేరు మాఘ పౌర్ణమినాడు బుద్ధుడు తన శిష్యగణాన్ని పిలిపించి, ఓ పెద్ద సమావేశంఏర్పాటుచేసి, "అబ్బాయిలూ, ఇంక మూణ్ణెల్లనాటికి నేను భౌతికదేహం చాలించి, నిర్వాణం పొంది పోతున్నాను; కాబట్టి జాగ్రత్తగా మసులు కొండేం" అని ఆదేశించాట్ట, మరి! ప్రతీ పెగోడాలోనూ మాఘపౌర్ణమినాటిరాత్రి దీని జ్ఞాపకార్థం కొంత తంతు జరుపుతారు విధిగాను ఇహ సంధ్యచీకటి పడుతుండ వగా, బుద్ధబిక్షువులంతా పెగోడాలు చేరు కుంటారు. భక్తకోటికూడా ముమ్మారు ప్రదక్షిణంచేసి, ఆలయంప్రవేశించి, బుద్ధ విగ్రహానికి ఎదరగా నివేదనలు ఉంచుతారు, కొవ్వొత్తులూ ఊదొత్తులూ వెలిగిస్తారు. అంతమందీ తమ తమ జాగాల్లో కూచు న్నాక, ఓ భిక్షువు బుద్ధప్రవచనాలు ఏకరువుపెడతాడు అతరవాత భక్తులు తెచ్చిన వొస్తువులు బుద్ధత్రయానికి (బుద్ధుడూ, బౌద్ధ ధర్మంవూ, భిక్షువులూ—యీ మూడింటినీ సముచ్చయంగా బుద్ధత్రయం అంటారు) నైవేద్యం పెడతారు.

అదయిన వెంటనే యీ భిక్షువులు యిద్ద రేసి చొప్పున, యీ నైవేద్యాలకి ఎదరగా కూచుంటారు. బుద్ధస్తవం (లాంటుంది) పనస చదివినట్టు చదువుతారు. మొట్టమొదటి ఆవృత్తం అవగానే యీ యిద్దర్లోనూ ఒకడు బుద్ధభగవానుడి జీవితచరిత్రంతా సవ్యాఖ్యగా చెబుతాడు. తరవాత మళ్ళీ 'పనస' ముక్కలు వొచ్చినట్టాయినా, భక్తులుకూడా పనస చెప్పొచ్చు. అయితే మొదటి ఆవృత్తం భిక్షువులే చెప్పాలి. కొన్నికొన్ని, ప్రదేశాల్లో యిది అర్థరాత్రితో అంతం అయిపోతుంది కాని సాధారణంగా తెల్లవార్లూజరుగుతుంది యీతంతు!

కోటలో కూడా యిదేమాదిరి తంతుజరుగుతుంది కాని, దాని ధర్మంవా అని మహా వేగిరం ముగించేస్తారు. రాజుగారు ఓ రెండూ, వారితల్లి మరోరెండూ తేనెపట్టు కొవ్వుతో చేసిన కొవ్వొత్తులు నాలుగు పెగోడాలకీ పంపుతారు. ఈకొవ్వొత్తులు ఒక్కొక్కటీ మూరెడు పొడుగూ, అరపౌను బరువూ ఉండాలి.

ఇది యిలా ఉండగా "మాఘరాజు" పండుగని ఇంకోటి యీనెలలోనే చేస్తారు; అంటే మాఘమాసానికి ఓరాజూ, వాడి పేరిట ఓపండుగానూ, అన్నమాట. వీడు అసలు రాజుమాత్రం కాడు. ఓబ్రాహ్మణ్ణి ఆవేళకి రాజుని చేస్తారు. కేశమంతటా పండినవరి, కంకులపాళంగా తీసుకువొచ్చి అయిదుకుప్పలుపోస్తారు. వారంరోజుల పాటు రాచకుటుంబంలోవాళ్ళూ, మంత్రులూ, ఉన్నతోద్యోగులూ అంతా, చిత్రంగా నక్షత్రాలూ నాగు (పాము)ల బొమ్మలూ వాటితో డాబుగా అలంకరించిన బళ్ళు యెక్కి ఊరేగింపులాగ వొస్తారు, యీకుప్పలున్నచోటుకి.

మాఘ శు॥ 14 (చతుర్దశి) నాడు ఓ బ్రాహ్మణ్ణి తీసుకువొచ్చి "మాఘరాజు"ని చేస్తారు ఈరాజుని కోటనుంచి బయలు దేరదిసి, పెద్దఊరేగింపూ సంబరంతో తీసుకు వొస్తారు. ఈ సంబరంలో ముందు రెండు పెద్దమైనపు బొమ్మలుంటాయి ఒకటి మొగబొమ్మ, రెండోది ఆడదిన్నీ. మొగబొమ్మ చేతిలో ఓదాంట్లో గొడవలీ, మరోదాంట్లో దివిటీన్నీ. ఆడబొమ్మ చంకని ఓబుట్టా, దాన్నిండా అన్నమున్నూ. వీటికితోడుగా మరోరెండుబొమ్మలు - ఒకటిపిళ్ళకొడుకూ, రెండోది కూతురూను. ఈ సంబరంలో మరుగుజ్జువాళ్ళనికూడా ప్రత్యేకించి తీసకు వొచ్చి ఊరేగిస్తారు. మాఘరాజుకి అయితే గజారోహణ యోగంవే! సంబరంలో అగమం రెండువొందలమంది ఉంటారు. బాజాలు వాగుతాయి. బ్రాహ్మలు శంఖాలు పూరిస్తారు. విశేషం ఏంవిటో తెలియదు గాని, ఆవేళ సంబరంలో ప్రతీవాడూ కొంకి కర్రలు చేతబుచ్చుకుంటారు.

వీళ్ళంతా కలిసి ఊరేగింపుగావొచ్చి, యీ ధాన్యంకుప్పలున్నచోట ముమ్మారు ప్రదక్షిణంచేస్తారు. దానితరవాత కుప్పలకి దక్షిణంగా యీ మైనపుబొమ్మలుంచుతారు. అప్పట్నుంచీ ఆ జాగా అంతా - పాపపరిహారం అయిపోయి - పవిత్రం అయిందన్నమాట. మళ్లీ మాఘరాజుగారిని ఏనుగమీద కూచోబెట్టి, ఆ జాగాకి మూడుప్రదక్షిణాలు చేయించి, ఊరేగింపుతో వారింటికి సాగనంపేస్తారు.

తరవాత మూడోనాడు మాఘరాజుగారు యీ మైనపుబొమ్మల్ని దహనం చేస్తాడు. వాటితోపాటు ధాన్యపుకుప్పలకీ అగ్గిముట్టిస్తాడు. అయితే వెంటనే నీళ్లుకూడా జల్లడం మూలాన్ని ధాన్యం పెటపెటపేలి పేలాలయి ఊరుకుంటాయి ఆ పేలాలు ప్రసాదం అని ఉన్నతోద్యోగస్థులదగ్గిర్నుంచి పాలికాపులవరకూ అందరికీ పంచిపెడతారు; మాఘరాజుగారి ధాన్యపుగాదెలో కూడా యీ ప్రసాదం ఉంచుతారు ఆబ్రాహ్మడి రాచరికం ఆసాయింత్రంతో సరి!

ఈ మాఘంలోనే బుద్ధభిక్షువులు, బౌద్ధ దేవాలయాల అవతల ప్రాయశ్చిత్తకర్మ చేసుకుంటారు కొన్నాళ్ళపాటు. ఈ రోజుల్లో ముఖ్యంగా వీళ్ళు పాటించవలసింది ఏవిటీ అంటే మౌనవ్రతం (మౌన వ్రతం అనబోయి తెలుగులో అన్నాను!) రాత్రి తెల్లవార్లూ పెదిమ కదపడానికి వీల్లేదు, చీకటిపడింది మొదలుకునిన్నీ. అంతే కాకుండా అడుగులో అడుగు వేసుకొంటూ తిరగాలి ఇలా తిరిగినప్పుడు ముందు అడుగు వేసిన కాలిమడమకి రెండో కాలి బొటనవేలు తగలాలి, ప్రతీ అడుగడుక్కీనీ. మధ్యలో ఎక్కడ తప్పినా పునరారంభం! ఇలా అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా తిరగాలి రాత్రి అంతాను. ఈ మోస్తరుగా ప్రాయశ్చిత్తకర్మ చేసుకుంటే మనసా, వాచా, కర్మణా—తెలిసీ తెలి

---

ముఖచిత్రం: జానకి.

# ★ కాంబోడియా కబుర్లు ★

అయిదు చిన్న చిన్న కట్టడాలు తయారు చేసి బాగా చక్కగా అలంకరిస్తారు. రాచ పురోహితులు ఏవో మంత్రాలూ తంత్రాలూ చదువుతారు. తరవాత నాలుగింటిని కోట ఆవరణకి వెలుపలిభాగాన్నీ, అయిదోది కోటలో సింహాసనం ఉన్న జాగాలోనూ ఉంచుతారు. దర్భలతో చేసిన తాడు ఒకటి తీసుకువచ్చి కోట చుట్టూ కడతారు; మంత్రాలు చదువుతూను. దక్షిణద్వారం నుంచి ఆరంభించి తూర్పుదిక్కుగా ఓ తోరం నూలుతాడు చుట్టి, దాని రెండో కొన సింహాసనం ఉన్నచోట్లోకి వొచ్చేటట్టు చుడతారు. అక్కడ విజయదీపిక కూడా ఉంటుంది. ఈ దీపికని ప్రధాన బుద్ధ భిక్షువు సమక్షంలో రాజుగారు స్వయంగా వెలిగించాలి. (తుమ్మ అపశకునం మాత్రం కాదు!) ఇలా వెలిగించిన యీదివ్వె కార్యక్రమం అంతం అయ్యేవరకూ వెలుగుతూ ఉండవలసిందే కాని, మధ్యలో ఆరిపోడానికి వీల్లేదు. ఈ తంత్రాంగానికి పంచక్షేత్ర విగ్రహాలు కూడా తీసుకువొచ్చి, సింహాసనం ఉన్న కొలువుకూటంలో పెడతారు.

వీటన్నిటితో పాటు గమనించవలసింది ఓ ముసలి మనిషి! గాథలప్రకారం, ఒకానొకప్పుడు యీ మనిషిదగ్గర అద్భుతం అయిన దోసకాయలు ఉండేవిట. వాటి శక్తులకి ఆశ్చర్యపోయి రాజుగారు యీ ముసలాడికి ఓ బల్లెంయిచ్చేరుట, దొంగలు ఎవ్వరూ కాజెయ్యకుండా యీ దోసకాయలు రక్షించుకోడానికి. అయితే వీడు జాగర్తగా కాపలాకాస్తున్నాడో లేదో అని అనుమానం తగిలి, రాజుగారు ఓరాత్రి ప్పుడు చప్పుడుగాకుండా బయలుదేరేరు, తనిఖీకి! దొంగఅనుకుని బల్లెం విసిరి రాజుగారిని చంపేసి, సింహాసనం ఎక్కేసేడు ముసలాడు! అదిగాథ. ఇప్పుడీ ముసలాడు నామకఃన్నూ.

ఈ తంత్రిక పాల్గుణానికే "మాంత్రిక దండా"లని చేస్తారు. ఏటిని చెరుకాకులు జడలా అల్లి చేస్తారు; వీటిమీద బీజాక్షరాలుంటాయి ఈ దండాలు కొన్నివొందలు కడతారు; పిలిచినవాళ్ళందరికీ తలొకటీ యిస్తారు; యిచ్చిన వాటితో పాటు కోరానూలు కూడా యిస్తారు; యీ నూలుకి అయిదు కొప్పెరకాలు కుక్కలు కట్టి ఉంటాయి. ఈ నూలు జంధ్యం వేసుకున్నట్టు ఎడమభుజంపైనుంచి కుడిచేతి కిందుగా వేసుకోవాలి. ఈ రెండూ - మాంత్రిక దండం, జంధ్యప్పోచా - ముఖ్యంగా ప్రత్యేకించి యీ తాంత్రిక ఫాల్గుణానికే వాడతారు. వెత్తైదేవడుల్వున్న పాగాలుకూడా (తలమట్టూ పున్నాలా చుట్టు కుంటారు) వాడతారుకాని, యీ పాగాలు ప్రతీదానికీ వాడరు.

ఫాల్గుణ బ॥ 15 (అమావాస్య) ఉదయాన్నే రాజపురోహితులు శంఖాలు పూరిస్తూఉంటే, పవిత్రస్నానంఆచరిస్తారు రాజుగారు విజయదీపిక ఆర్పేస్తారు. చిట్టచివరన ఓ ముసలి బుద్ధభిక్షువు వొచ్చి కోట ఆవరణలోనూ, కోటలో సింహాసనం అదీ ఉన్నచోటా పవిత్రోదకాలు ప్రోక్షిస్తాడు. ఇహ ఏపీడా ఉండదన్నమాట!

## (అయిపోయింది)

# కోటమ్మ గెలిచిన లాటరీ

గొల్లపూడి కేశవరావు

లక్ష్మీంనారాయణ కొడుక్కి చూస్తుండగానే సిరి అబ్బింది! ముప్పై మూడు రూపాయలతో అంకెల లాటరీ వేయగా ముప్పై వేలరూపాయలు అలా కొక్కె వచ్చేశాయిట.

ఈవార్త కూత వేటు దూరం లోవున్న కోటమ్మ చెవినిపడ్డది. కోటమ్మకు లక్ష్మీంనారాయణ మరిదిఅవుతాడు.

వీడు .. అంటే పంతులు మొన్న మొన్నటిదాకా యింట్లోనుంచి బియ్యం ఎత్తుకుపోయి కోవటికొట్లో అమ్మకునేవాడు బీడీముక్కలకోసం. మెట్రిక్కు పరీక్ష మెట్టుఎక్కలేక దఫాలవారీగా మొట్టికాయలుతిని విశ్వవిద్యాలయంలోని తన సభ్యత్వాన్ని అసభ్యంగా విరమించుకున్నాడు. ఈపంతులే ఎక్కడా కొని డబ్బుపుట్టక, పెళ్లాంమెళ్ళోని పెళ్లినాటి చంద్రహారం ...ఆమె నిద్రపోతూండగానే అనుకోండి... వూడదీసుకు వుడాయించబోతూవుండగా. .... అయినవాళ్లుకాబట్టి అంగుళ్లువొత్తుకొని వూరుకున్నారు ఇటువంటిపంతులు యింతసొమ్ముకు యిట్టే అధికారిఅయి వూరుకున్నాడు.

కోటమ్మభర్త నారాయణమూర్తి అయిగు ఎకరాల సుక్షేత్రమైనభూమినీ, ఒక మండువాలోగిలినీ 'కోటమ్మపరం'చేసి కన్నుమూశాడు యిప్పటికి షుమారు యిరవైయేళ్ళక్రితం. ఆ అయిదు ఎకరాల మీద కోటమ్మకు సాలీనా అయిదు పుట్ల ధాన్యంవస్తుంది. ఆ వున్నయిల్లు కాస్త అద్దెకుయిచ్చుకొని ఆవిడ అపక్కనే, ఒక పూరికొంపవేసుకొని కాలం వెళబుచ్చుతూవుంది. వెనకాముందూ "నా" అనేవాళ్లు లేకపోబట్టి చేయవలసిన కార్యం కరామత్తులు యేమీ లేకపోవటంవల్లా, కోటమ్మగారు దాదాపు పదివేలరూపాయలు వెనకేసుకుంది అని నలుగురూ అనుకుంటూవుంటారు. అయితే ఆబాపతు మూలధనం యేమూల దాచుకుందో పరాత్పరుడికికూడా తెలియదనటానికి తార్కాణం యేమిటంటే ఆగ్రామంలోవున్న మువ్వురు తస్కరులు ఆపూరికొంపమీద ఒకకన్నువేసి రెండు మూడుసార్లు కన్న మేసిగాలించినా ఆ గుప్తధనం తాలూకు ఆచూకీ చిక్కక నిస్పృహచెంది వూరుకోటమే.

ఇంతకీ పంతులుకు లాటరీలో డబ్బు వచ్చిందని తెలియగానే కోటమ్మకుకూడా ఆవిధంగా డబ్బు కష్టపడకుండా మూటకట్టాలనే వుబలాటం యెక్కువ అయింది. ఈవయస్సులో కోటమ్మ యెవ్వరి కొరకు డబ్బుసంపాదించాలని ప్రయత్నం చేస్తూవుందో ఆ భగవంతుడికే తెలియాలి. కోటమ్మ వంటరిది. సాలీనావచ్చే అయివేజు వ్యయపడగా యింకా తలమునకలుగా మిగులుతుంది. ఆమెకువున్న వ్యయం మట్టుకు యేమున్నది గనక. లోకుంకు తెలియకుండా ఆవిడ రెండుపూటకూడా భోజనమే చేస్తున్నా, అది యెంతమాత్రం సంపూర్ణాహారంక్రింద లెక్కలోకి రాదు. రెండు ఎండుమిరప కాయలు, యింత చింతపండూతో ఆవిడకు వారంరోజులు గడిచిపోతుంది. ఆమెవ్యయం యేపరిస్థితుల్లోనూ నెలకు 25 రూపాయలకుపైబడదు.

ఇందులా సహంసొమ్ము ఆవిడకు కేవలం యింటిఅద్దెమీదే వస్తుంది. ఇంతమాత్రాన కోటమ్మకు యింకా ధనం కూడబెట్టాలీఅనే ఆసక్తిఎందుకూ అంటే అందుకు తృప్తిపరిచే సమాధానం యివ్వటంకష్టమే. అవుతే జరామరణాలు లేనివాడుగా యెంచుకొని మనిషి ధనమూ విద్యా సంపాదించటానికి పూనుకోవాలీ అనేసూక్తి వుండనేవుంది. పక్షులు ఎందుకు ఎగురుతాయీ, మేఘాలుయెందుకు వర్షిస్తాయీఅంటే అది వాటికి సహజగుణం అనిమట్టుకే చెప్పగలం. ఆపైనచెప్పటం మనవల్లకాదు. అందువల్ల కోటమ్మకు డబ్బుసంపాదనమీద యింత ఆపేక్ష దేనికీ అంటే అదేజవాబు చెప్పవలసివస్తుంది.

పంతులుకి లాటరీలో డబ్బువచ్చింది. వాడిదగ్గర యేమంతమంచిగుణాలు వున్నాయని లక్ష్మి అతగాణ్ణి వరించింది. చదువా —శూన్యం— తెలివితేటలా పూజ్యం, అనుభవమూ అంటే అదీలేదు. కోటమ్మ తమ్ముడికొడుకు వెంకటరత్నం *M. A.* ఫస్టుక్లాసులోపాసయి ఎక్కడా వుద్యోగం దొరక్క, కొనకిపుస్తెకట్టినపెళ్లాన్ని పోషించుకోలేక పుట్టింటిదగ్గరే అట్టేపెట్టి నానాఅవస్థలూ పడుతూనే వున్నాడు. అటువంటివాడి మొహంకూడా చూడదు లక్ష్మి. కానుకు కొరగానివాడు ఎవడాఅని చూచి వాడినే వరిస్తుంది - అందువల్ల అదృష్టాదృష్టాలు మొహంమీద కొట్టవచ్చినట్లు కనపడవని యేపుట్టలో యేపాముందో ఆపుట్టకే ఎరికగాని మరొకరూ చెప్పతరంకాదనీ కోటమ్మ గ్రహించింది. అందువల్ల తనుకూడా తన అదృష్టాన్ని పరీక్ష చేసుకోవాలనీ— ఆ యోగమేవుంటే తనకూ లాటరీరావటం అసంభవంమట్టుకు కాదనీ కోటమ్మ గ్రహించింది.

అయితే ఆలాటరీ యెల్లా వెయ్యాలో యేమిచెయ్యాలో తనకు ఎవరుచెప్తారు. ఆ మర్మంకాస్త గ్రహిస్తా తరువాతవిషయం ఆలోచించుకోవచ్చు. అది చెప్పటానికి ఈవూళ్లో పంతులుని మించి తాహతుగల వ్యక్తి మరొకడు కనపడకపోవటంతో మర్నాడు లక్ష్మీంనారాయణయింటికి వెళ్లి ఆ గుట్టు గ్రహించాలని అనుకున్నది కోటమ్మ.

* * *

"అహోఁ యేవీ వదినే వచ్చిందే" అన్నాడు లక్ష్మీంనారాయణ కోటమ్మరాక చూచి.

కోటమ్మ ఆ ఛాయలకి యీమధ్య సంవత్సరం దర్శిలా రావటం యిదే ప్రథమం.

"ఏవీ లేదర్రా. చాలాకాలమయిందీ... చూసిపోదామని వచ్చాను. ఏదీ కోడలు కనబడటమేలేదూ" అన్నది కోటమ్మతీరిగ్గా సావిట్లో చదికిలపడి.

"ఎవరూ సర్వలక్షణమ్మ! దొడ్లో పిల్లలకి చద్దిఅన్నాలు పెడుతూవుంది" అన్నాడు లక్ష్మీంనారాయణ.

"అవునా అబ్బాయీ...విన్నాను. విని సంతోషించాను. అంతా ఒక వదుట్లో వాళ్ళమే అయింతరువాత మంచొచ్చినా చెడొచ్చినా చూసుకోవలసినవాళ్లమే గదా అని చక్కావచ్చాను. ఏదీ ఆ బ్బాయీ బొత్తిగా వోపిక దచ్చిపోతూవుంది. ఇహా నేనుమటుకు బతకపోయి బతుకుతానా, కాళ్లు బొత్తిగా స్వాధీనం కావటంలేదు. అందుకనే ఎక్కడకీ పోవటం తగ్గించుకున్నాను." అని యెవరూ అడక్కుండానే తను యెక్కువసార్లు రాకపోవటానికి తగిన సంజాయిషీ చెప్పుకొని అన్నది—

"అవునులే నాసాద యెప్పుడూ వున్న .. యింతకీ ఏదేవాడు పంతులు"

"రాత్రికే బెజవాడనుంచి వచ్చాడు. ఏ కాఫీహోటలుకో పోయివుంటాడు" ఇంతలో లక్ష్మీంనారాయణభార్య కాంతమ్మ



# కోటమ్మ గెలిచిన లాటరీ



అటురావటంతో అతగాడు యీ పీడ వది లించుకొని బయటపడ్డాడు.

"ఏవీ అక్కగారు ఆవుపేడ అయిపో యాక" అన్నది కాంతమ్మ నవ్వుతూ

"ఏదీ కాంతమ్మా! ఇదుగో రావాలి అదుగో రావాలి అనుకోటమేగాని బొత్తిగా తీరిక చిక్కిపోయిందిగదా"

"ఇంకా నయం - మీరు కాబట్టి యీ మాత్రమున్నా తిరుగుతున్నారు. మీ వయస్సుకి మేము యేమవుతామో"

"పంతులు బెజవాడ వెళ్లాడుటగా" అని అడిగింది కోటమ్మ అతను బెజవాడ ఎందుకు వెళ్లాడో తెలుసుకోవాలి అనే ఆశతోటి - కోటమ్మ వేసిన ప్రశ్నలోని అంతరార్థం గ్రహించింది కాంతమ్మ. అయితే యీ పొంచి కేకలన్నీ యిదివరలో పంతుల్ని ఎందుకూ కొరగానివాడిగా గున్నా, ఆటకాయ అకతాయగానూ జనకట్ల ప్రాళ్లో ఆడిపోసుకున్నారు అటువంటి తన కొడుకు హఠాత్తుగా అర్థనకరుడవటంతో యీ ముండ అందరికీ వాడిమీద యీనాటికి అభిమానం కలిగింది.

'మరవీలేమ్మా! అగదబాంకుట అందులోనుంచి డబ్బు తెచ్చుకునేటందుకు పోయాడు నువ్వు విన్నావుగదా అక్కా" అన్నది కాంతమ్మ

"అదగో విన్నానే సుబ్బమ్మ అంటుంటే విన్నాను— అవునా కాంతమ్మా యింతకీ దేనికైనా కలిసిరావాలిగదా— మరి దాని నోరు పడా అసుబ్బమ్మ యిప్పటికీ కళ్లల్లో నిప్పులు పోసుకుంటోంది— అదుగో నీకొడుకూ వచ్చాడు ఏరా అబ్బా యీ కులాసాయేనా" అని పలకరించింది పంతుల్ని కోటమ్మ

పంతులు ఆమెవంక ఓసారి చూసి తల ఎగరేసి లోపలికి వెళ్ళిపోయాడు కోటమ్మ అంటే పంతులుకు యేనాడూ సదభిప్రాయం లేదు. ఇవాళ్ళ కోటమ్మ రాకలో తనకు తెలియని అర్థం యేదో వుందనీ ఏదో ఆరాలాగి ఊరంతా ప్రాకే నిమిత్తం కోటమ్మ పనిగట్టుకు వచ్చిందనీ పంతులు అనుమానపడ్డాడు

పంతులు యీవిధంగా గుల్ల పుచ్చుకుపోవటం కోటమ్మకు కొరగరానట్టు అయింది. "వీడెంత జాయి వీడింత యెంత చనూ" అనుకున్నదిలోపల. అయితే తను యిప్పుడు పనిగట్టుకు వచ్చింది కారణం కోట్లాటకోని తెచ్చుకునేందుకు కాదుగదా అసలు రహస్యం కానా వాడిచేత చెప్పిస్తే యిహ మరి పనేముంది వీడిలో

"మాకాన్నారే రెండెకరాల కిల్లవాడేని కొనిపోదామనిదన్నే." కాంతమ్మకు కూడా పంతులు ప్రవర్తన అంత నచ్చలేదు వెంటనే లేచి—

"అయోగ్యవాడింకా పుత్రకుంక. యిప్పుడే వస్తాడు కూర్చోవదినా" అని లోపలికిపోయి పంతులుతో యేవి చెప్పిందో యేమోగాని మరో రెండు క్షణాల్లో పంతులు రుసరుసలాడుతూ బయటపడ్డాడు.

"ఏవీ.. నాతోపని"

"లేదోయ్ తండ్రీ యీ ముసలిముండ మీద నీకింత కోపం దేనికి"

"దేనికీ కోపం .. యీ నాటికిగా నీకళ్లకి మేము అవుపడ్డాం"

"అదుగో రా అబ్బాయీ — అల్లా అన్నావు నాకు నచ్చింది నాకు యిప్పుడు అరవయ్యోయ్య పడివచ్చింది. ఏదిరా బాబూ యిక యెన్నాళ్లు బతుకుతానో ఎవరు చెప్పగలరు. ఇటు కాలు అటు వేస్తే గంపెడంత ఆయాసం ప్రాణం కొట్టుకుపోతూంది — తామరాకుమీద నీటిచుక్కలా. ఆ అదీ రాలిపోతుంది ఎప్పుడో" అన్నది కోటమ్మ ఎంతో విచారం అభినయిస్తూ.

అదికాస్తా యెప్పుడు రాలిపోతుందా అని ఆశతో ఎగురు చూచేవాళ్ళూ వున్నారు. అయితే యీ సంభాషణ పంతులుకి విపరీతం తలనొప్పి కలిగించింది. ఇదుగో యీ ముండ ప్రతిరోజూ పురాణమనీ హరికథ అనీ వుత్సవాలనీ వూరంతా ప్రదక్షిణం చేస్తూనే వుంటుంది. తాను యింతవరకూ తక్కువ స్థాయిలో వుండబట్టి యీవిడగారి కళ్ళు తనని ఆనలేదు—నోరు అవిరామంగా నలుగురితో తన్ను గురించి ప్రలాపిస్తున్నప్పటికీను ఇంతకీ యీనాడు అనుకోని ఐశ్వర్యం కలిసిరావటంతో యీవిడ కళ్లల్లో పొరలు విచ్చుకున్నాయి. అర్థం పురుషార్థంలో వుత్తమం వ్యక్తియొక్క విలువలను పెంచాలంటే నైతికశక్తి కొలబద్దగా పరిగణించే కాలం చెల్లిపోయింది మాటలతో పోట్లు కొనుక్కున్నట్టే గౌరవమూ ప్రతిష్టా కీర్తి గూడా కొనుక్కోవచ్చు కేవలం కొనుక్కోటమే కాదు డబ్బు అనే అద్దంలో వాటితాలూకు మిథ్యాప్రతిబింబాలను చూచుకోవచ్చు. అయితే యీ అద్దం పగలకుండా వున్నంతకాలమూ ఆ ప్రతిబింబం స్థిరంగా వుంటుంది అది కేవలం మిథ్య కావచ్చు - కోరి తెరమీద పట్టలేకపోవచ్చు కాని అది మిథ్యఅని చూచేవాడికి తెలిసినా తన మనస్సుని మోసంచేసుకొని కర్తయొక్క అంతస్సు పెంచుతాడు

"నీలాటివాళ్లు చాలా కాలం బతుకుతారు" అనుకున్నాడు పంతులు పైకిమాత్రం "యింతకీ యేవిపని నాతో" అన్నాడు

ఈ రుసరుసలు పరుగులమీద పంతులుతో యీ విషయం ఆమె సవిస్తరంగా ఎల్లా చెప్పగలదు. వీడేమో ముళ్ళమీద కూచున్నట్టుగా ఎగిరిపడుతున్నాడు. అదిగాక తనపనికోసం వాళ్లింటికి వచ్చానని చెప్పటం ఆమెకు నామర్దాగా తోచింది తీరా నోరు తెరిచి అడిగినా - యీ పంతులుగాడు వట్టి తగ్గుబుద్ధావతారం శాంతంగా జవాబు చెప్తాడా? వాడు గనక అల్లా చెప్పకే తప్పితే తనతల తొలగించినట్లే అవుతుంది

"అమరేమీ లేదురా! అసుకీలమ్మ కోటి పెడితే యిల్లావచ్చాను నిన్న కనుక్కుపోదామని - అదేరా మా యింటిగోడ వున్న రామనాథం పెళ్లాం"

"ఏవిటి కనుక్కురమ్మన్నది"

"ఆ లాటరీ యేదో దానికి వెయ్యాలని వుందిట. మొగుడికి తెలుస్తే యేవి కోప్పడిపోతాడో అని చాటుగా నన్ను పిలిచి 'అత్తా నువ్వు అయినదానివిగదా కాస్త నాకో సంపోయి కనుక్కు రాగూడదుగా' అని అది చేసినగోల యింతా అంతా కాదంటే నమ్మ దానిపోరు పడలేక యిట్లా వచ్చా కాని' అన్నది కోటమ్మ నేర్పుతో నెపం మరొకరిమీదకి నెట్టి

కాని పంతులేమీ పసిపిల్లాడు కాడు. కోటమ్మ వేసినయెత్తు యిట్టె పసికట్టేశాడు. అయితే వళ్ళ కాలు గడపలోనూ మరొకటి శ్మశానంలోనూ వున్న యీ ముసలిదానికి యింకా డబ్బుమీద ఆశ పోనికా అని అతను ఆశ్చర్యపోయాడు. ఆమె తిను కడుపుకట్టా తిననూ తినదూ. ఎప్పటిసొత్తు అప్పుడు మూటకడుతూనే వుంటుంది. గావటమూ భోగమూ ఎరుగని ధనం అది. ఇంకానా యింకా డబ్బు గణించాలి అనే ఆశ తీరలేదు ఆమెకి

"అదుగో కేపో సూసో ఆకంపెనీవాళ్లే యేజెంటు వస్తాడు వాళ్లనడిగి కనుక్కోను" అన్నాడు పంతులు విసుగుతో కోటమ్మ ఆమాట పాటించక వేరేప్రశ్న వేయటానికి పూనుకోగానే పంతులు వెంటనే అన్నాడు.

"ఆవిడ మొగుడికి తెలిసేవట్టుగా నా ఏపీ కలు ఏరెయ్యగలడు" అంటూనే విసవిసా బయటికి నడిచాడు పంతులు

కోటమ్మకు యేమీ పాలుపోలేదు. పంతులుగాడు లొంగుతాడు? యీ విషయం బయటపెట్టకుండా దాచుకుంటున్నాడో ఆమెకు అర్థం కాలేదు కాని పంతులు ఆవిధంగా చెప్పకుండా తప్పించుకుపోవటంవల్ల తను ఆ విషయం వీలయినంత త్వరలో తెలుసుకోవాలన్న కోరిక యెక్కువయింది అంతేకాకుండా తను తెలుసుకోదలచిన వస్తువుయొక్క విలువకూడా యీ గోప్యంవల్ల పెరిగిపోయింది దాచుకునే వస్తువు

అమూల్యమైనదనే విషయం కోటమ్మకేకాక అందరికీ తెలిసిన విషయమే కదా.

* * *

మర్నాడు పోష్టు బంట్రోతు వెంకటస్వామి ఆ దారిని పోతూవుంటే యీ విషయం వాకబు చేసింది కోటమ్మ. వెంకటస్వామి బ్రాకెట్లు ఆడటంలో వుద్దండుడు అవుగాని అతనికి యీ పజిల్సు సంగతి తెలియదు. అయితే కోటమ్మ యింటిముంగిలి పందిరిమీదగా అల్లుకు ఎగబాకిన సొరపాదూ దాన్ని అంటిపెట్టుకొని స్వేచ్ఛగా వేలాడుతున్న మెయిల్ బాగ్ లాంటి సొరకాయా చూసి అతను తనకు తెలిసిన విషయాలు తీరిగ్గా చెప్పి ఒక పాత యింగ్లీషు పేపరులోనుంచి ఒక ముక్క బయటపెట్టి అన్నాడు

"ఇదుగో అవ్వగారూ - యీ గళ్ళల్లో 1 గాని 2 గాని మా యిష్టమొచ్చిన అంకె నిలువునా వెయ్యొచ్చునే అయిదు రూపాయలు పెట్టి 14 దఫాలు వెయ్యొచ్చు. ఆపైన అదృష్టం తిన్నగావుంటే లక్ష రూపాయలు రావచ్చు" అని పజిలు పూర్తిచేయటానికి కావలసిన ప్రధమ సూత్రాలు క్లోపిగా చెప్పటమే కాకుండా ఎగురుగుండా తనో పుంచి పూర్తిచేసికూడా చూపించాడు ఆపైన కోటమ్మ యిచ్చిన సొరకాయ హస్తాన గిలించి ఎంగ్గుయికలిస్తూ వెళ్ళిపోయాడు

వెంకటస్వామి చెప్పిన కొద్దిపాటి విషయాలూ కోటమ్మకు తెలియలేదనుకోవటానికి యెక్కడ సావకాశాలున్నాయి ఏమైనా ఆమె పక్క విషయం తెలుసుకుంది అదృష్టం అరచేతి వైకుంఠం కావాలంటే యిది ద్వైతమా అద్వైతమా అనే మీమాంసలో పడే సలక్షణంగా నిర్ణయించుకోవటం పైనే ఆధారపడివుందని అప్పటికే కోటమ్మ అనేకమార్లు యిదివరలో శంకరాచార్యులవారి భాష్యాల తాలూకు వుపన్యాసాలైతే విన్నదిగాని ఆమె పూర్తిగా విశిష్టాద్వైతి. అదృష్టం బహుకొద్దిదఫాలే మానవజీవితాన్ని నవజీవితం చేయబోతుంది. అయితే నీతినియమం అనే సర్మసూత్రాలకి కట్టుబడి ఆ అవకాశం అందిపుచ్చుకోకుండా నిర్లక్ష్యం చేసినవాడి మొహం మళ్ళా చూడదు లక్ష్మి. అందువల్ల త్వరపడి పనికి పూనుకోవాలి అని నిర్ణయించుకుంది కోటమ్మ.

కోటమ్మ మణియార్డరు సొమ్ము గళ్ళ కాగితం వీరాస్వామి చేతికిచ్చినరోజు ఆమె వాలిపోతున్న జీవితంలో ఒక మధురఘట్టం. ఆమె గుర్తుకు మిగిలినరోజుల్లో ఏదీ ఆనాటి తియ్యటి భావాలకు సరిరావు కోటమ్మ ఆ రాత్రి నిద్రపోయింది కాని ఆ నిద్ర కరెన్సీ కాగితాల తాలూకు కలలతో నిబిడమయిన కలతనిద్ర అయింది

మరి యిదేమి ఖర్మమోగాని పదిహేను రోజులు తాళితేగాని ఫలితం రాదుట. ఒక్కొక్క రోజూ ఒక్కొక్క మన్వంతరంలా వుంది. పచ్చి శీతాకాలమయిన ఆ దినాల్లో సైతమూ పగలు పొడిగించుకుపోయినట్లూ, రాత్రి పదించుకుపోయినట్టూ వున్నది చకోరపక్షి అనే ఒక పక్షివుందిట. అది రాత్రి చంద్రుడితోటీ వెన్నెలతోటీ ఆనుకొని పగలు సూర్యుడున్నంతసేపూ అతిగాస్తే తిట్టుకుంటుంది యింకో జారు కోడేమో అని అదేవిధంగా కోటమ్మ ఆత్రుతతో మనస్సు ముంగుకు పరిగెత్తుకుపోతూ వుంటే సూర్యుణ్ణి నిందించుకుంటూ కాలం గడుపుతోంది

ఆరోజు కోటమ్మ ధవళవస్త్రశోభితయై ఆ పల్లెటూళ్ళోని గాంధీమహాత్ముని సిమెంటు విగ్రహం యెదుట ఫలితాలు గోరికే పత్రిక రాకకోసం ధ్వజస్తంభంలా నిలబడివున్నదీ అంటే డబ్బు మనుష్యులమీద ఎంతటి ప్రభావాన్ని కలిగివుందో అందుకు సజీవ ప్రత్యక్ష ప్రమాణం కాక మరేవి అవుతుంది?

ఇదివరలో పదిహేను రోజులూ పదిహేను సంవత్సరాలుగా గడిచాయి. మరి యిప్పుడో ఒక్కొక్క నిముషమూ అంతకన్నా యెక్కువకాలం తీసుకుంటూ గడుస్తున్నాది ఎంతసేపు నుంచున్నా కాళ్లు పీక్కుపోవటంగానే వుంది కాని ఆ పత్రిక కళ్ళపడే భాగ్యం కలుగకపోవటంతో తను పొద్దునే లేచి కోరికలు యీరికలెత్తగా సూర్యనారాయణమూర్తి తండ్రికి పెట్టిన నమస్కారం ఫలితంలేని ఆడంబరంగానే మిగిలిపోయింది.

తనకు పేపర్లతో పరిచయమున్నప్పుడు వుదయం 8 గంటలకే పేపర్లకట్టలు బయనిక్కులు వనకాల కట్టుకు పరగలను పోయే పేపరుకుర్రాడు యీరోజు ఎక్కడా అయిపూ ఆనవాలూ లేకుండాపోవటమూ, కాలం మానవజీవితాల్ని ఆశల్ని ఖాతరుచేయ

ఇటీవల కొందరు రచయితలు ఇదివరలో అచ్చయిన తమ రచనలను క్రొత్త రచనలన్నట్లు ఇప్పుడు తిరిగి మాకు పంపడం, కొందరు ఇతరుల రచనలను అన్యభాషలలోనుంచీ, తెలుగులోనుంచీ సంగ్రహించి స్వతంత్ర రచనలుగా పంపడం జరుగుతున్నది. వీరు సోదర రచయితలకు, మాకు జరుగుతున్న అపచారాన్ని గుర్తించడంలేదు. మాకు వచ్చే రచనలను, అనుమానంతో పరిశీలించడం రచయితలకుగాని మాకుగాని గౌరవప్రదం కాదని గుర్తించవలసిందిగా వీరిని ప్రార్థిస్తున్నాము. ఇందువల్ల చిక్కులకు లోనుకావచ్చునని ఇట్టివారు గ్రహించడం మేలు. ఇదివరలో మా పత్రికలో గాని, ఇతర పత్రికలలోగాని ప్రచురించబడిన వేలాది రచనలను చదివి జ్ఞప్తిలో ఉంచుకోడం ఏ సంపాదకునికైనా అసాధ్యమైన విషయమని ప్రత్యేకం చెప్పనవసరంలేదు.

అన్యథా సూచించినప్పుడు తప్ప, మాకు వచ్చే రచనలు మౌలికమైనవి, పంపినవారి స్వతంత్ర రచనలేననే, భావంతోనే మేము ప్రచురించడం జరుగుతుందని అందరూ గుర్తించ ప్రార్థన.

## మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలనుకూడా గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫోటోలతోనే చేర్చిపంపాలి

బుక్ పోస్టుకు అదా స్టాంపులు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫోటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫోటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎటువంటి సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

కుండా వక్రమార్గాన పోవడమే అవునని అనుకుంది కోటమ్మ.

“ఏవయ్యోయ్ లాంచీ వచ్చిందా” అని కేకేసి అడిగింది కోటమ్మ గంపని చేత్తో పుచ్చుకుని పూరుకుక్కగా పోతూవున్న బాటసారిని.

అతగాడు 8 గంటల లాంచిమీద రేపల్లె పోదామని హడావుడిగా పరుగులెత్తి కృష్ణ గట్టు ఎక్కగానే వదిలాక ఫర్లాంగు మేర చొచ్చుకుపోయి అన్ను వెక్కిరిస్తున్నట్టుగా “కిచకిచ”మంటూ సాగి పోతూ, నవ్వుతున్నదా అన్నట్లు నవకాల తెల్లని నురగ వదిలేసి ప్రవాహంలోకి చొచ్చుకుపోతున్న లాంచీని పక్క కిళ్లీకొట్లోని గోడగడియారం చూపే 8 గం. 24 నిముషాలకైనా చూసి యింకో గంట కాలం యింత వేగంగా నడవటానికి హేతువు యేమిటా అని ఆలోచిస్తూ వస్తున్న ఆ బాటసారి కోటమ్మదృష్టిలో నుత్తలా కదలిక లేకుండా పోతున్న కాలం బాపతు సోమరితనం గ్రహించలేక చాలా చిరాకుపడ్డాడు.

“ఏవో ఏవిచచ్చిందో” అంటూ ముందుకు సాగిపోయాడు ఆ బాటసారి

ఎండ చురచురా పైకి వస్తూనేవున్నా యెక్కడా లాంచీవచ్చిన సూచన కనపడక పోవటంతో కోటమ్మకు వాస్తవంగా మా చెడ్డ చిరాకు కలిగింది ఇంతకు తనకోపం నిర్హేతుకం కాకపోయినా నిరర్థకమనీ, తను ఎవర్ని అదలించి ఎండాయిన్నీ అడిగే అధికారంకాని, అవకాశంకానీ లేదని గుర్తించిన కోటమ్మకు, ఆ ఆగ్రహం చెరచెరా ఎగబ్రాకే ఎండతో కలిసి వళ్లు చిటపట లాడిస్తూ తగని చిరాకూ విసుగూ కలిగించింది

“అమ్మయ్య” అనుకున్నది కోటమ్మ. దూరానే సైకిలుమీదవస్తున్న పేపరు తెచ్చే కుర్రాణ్ణిమాసి వాడు వాయువేగంతో విగ్రహంచుట్టూ ప్రదక్షిణంకొట్టి వుత్తరం పక్కగావున్న కిళ్లీషాపుదగ్గర సైకిలు దిగి పేపర్లకట్ట విప్పుతుండగానే కోటమ్మ రెండు అంగలలో అక్కడికి పోయి—

“అబ్బాయ్! ఆ-దినపత్రిక యివ్వరా” అని అడిగింది అణాకాసు చేత్తో చూపిస్తూ

ఆ కుర్రవాడు ఆవిడవంక వోమారు ఆశ్చర్యంగా చూసి అన్నాడు.

“ఆ పేపర్లు రాలేదు”

“ఓరి నాయనా నీఎదుట కనపడుతూనే వుంటే లేదంటావేమోయ్! అన్నది కోటమ్మ సూటిగా.

వాడు కోటమ్మవంక హేళనగా చూసి అన్నాడు.

“ఆ-కనపడుతూనే వుంది రెండుకట్ట-సిటీ పోలీసు.”

కిళ్ళీకొట్టువాడితో సహా మరో యిద్దరు జూలాయి వెధవలు విరగబడి నవ్వారు కోటుమ్మకు విపరీతమైన ఆగ్రహం కలిగింది

"ఓరి మీ సంఘం సల్లుంగాల్లా ఏమి విరగబడిపోతున్నారూ — ఏమి విరగబడిపోతున్నారూ" అని అరిచింది చేతులు తిప్పుతుంటూ

కిళ్ళీకొట్టువాడికి ఎందువల్లో గాని ఆమె గారియందు విపరీతమైన గౌరవ భావం పుట్టుకువచ్చింది

"ఏడిశారు యెదవగారా — గావగ్రలు పొద్దుపగలే — పెద్దాళ్ళతో యెకాళోళం యేట్రా" అని వాళ్ళని మందలించి కోటుమ్మ వంక చూచి అన్నాడు "అయితే అవ్వగారూ పేచరు తొలి చేసుకుంటారండీ."

కిళ్ళీకొట్టువాడు కనపరిచిన కనికరం కపట నటన అని వీళ్ళందరిలోకీ పోకిరీవెధవ వాడేనని కోటుమ్మ గ్రహించింది. వాడు అడిగిన ప్రశ్న వినగానే తక్కిన యిద్దరూ మళ్ళీ నవ్వారు

#  కోటమ్మ గెలిచిన లాటరీ 

అపక్కనే సోడా తాగుతున్న ఓ పెద్ద మనిషి గుటకమింగి

"బామ్మగారూ . ఆ పేపరు యివాళ్ళ రాలేదండీ, రైల్లో కట్ట తప్పిపోయిందిట" అన్నాడు జోక్యం కలిగించుకొని

అందువల్ల ఆనాడు వో కురుక్షేత్ర సంగ్రామం చూపువానిలో తప్పిపోయింది. అయితే కోటమ్మ విన్న వార్త ఆమెను నిలువునా కదిలించివేసింది. తను యింతవరకూ పడ్డ శ్రమా జరిగిన అవమానమూ కోసరు మిగిలిన ఫలితమూ యిదంతా వృధా అని తెలియగానే కోటమ్మ తన కర్మని నిందించుకుంటూ యింటి మొహం పట్టింది .

"ఈ పేపర్లు హఠాత్తుగా యెందుకు తప్పిపోతాయీ—"

"ఇవన్నీ అపశకునాలేనా" అనే విషమ సమస్యలతో సతమతమవుతూ కోటమ్మ మధ్యాహ్నం రెండు గంటలదాకా విచారిస్తూనే వున్నది. కనపడ్డవాళ్లనల్లా ఫలానా పేపరు వచ్చిందా అని వాకబుచేస్తూనే వుంది. ఆ పేపరు రివిన్యూ యినస్పెక్టరుగారింటికి వస్తుందని తెలిసి రెండు గంటలు దాటిన దర్మిలా కోటమ్మ సరాసరి పోయి వాళ్ళింట్లోనే తిష్ఠ వేసింది. పొద్దుపోయేదాకా చూసి చూసీ కోటమ్మ కళ్లు కాయలు కాశాయే గాని ఎక్కడా పేపరు వచ్చే సూచనలు కానరాక పోవటంతో బరువైన హృదయంతో యింటిపట్టుకు చేరుకోగానే ఆమె స్నేహితురాలు సుబ్బమ్మ యెదురుపడి "విన్నావుటే పిన్నీ నీకేదో టెలిగ్రాము వచ్చిందిటగదే ఎక్కడికి పోయావూ యిందాకట్నుంచీ" అన్నది.

టెలిగ్రాం మాట వినిపడగానే కోటమ్మ ఖంగారుపడిపోయింది. ఈరోజు లేచిన వేళావిశేషం తెలియదుగాని ఒక్క శుభవార్త వినిపడలేదు ఇంతలో పులిమీద పుట్రలా యీ ఖబురు యేమిటో అని ఆమె గగ్గోలు పడిపోయింది. తన పక్కగానొక్క తమ్ముడు విశాఖపట్నంలో రైళ్ళమీద పని చేస్తున్నాడు. .అశుభం అనుకోకూడదుగాని మరోలా అవలేదుకదా అని కోటమ్మ వెంపేలు పడిపోయి విసవిసా పోష్టాఫీసుకేసి పోయి చూచేసరికి ఆ ఆఫీసుకు తాళాలు వేసి వుండటమూ, పోష్టుమాష్టరు పరమేశ్వరశర్మ కోర్టు స్టాంపులు కొని తెచ్చుకునేందుకు పొరుగూరు పోయాడనీ తెలిసి ఆమెపడ్డ వేదన యింతింతనటానికి వల్లకాదు.

*        *        *

లక్షింనారాయణ యింట్లో గొప్ప కల్లోలం చెలరేగింది.

"నాన్నా కోటమ్మకు లక్షరూపాయలు వచ్చాయిట" అన్నాడు పంతులు లక్షింనారాయణతో.

"హాఁ వుత్తది! నేను నమ్మను"

"వుత్తదేమిటి టెలిగ్రాం వచ్చిందని వీరాస్వామి చెప్తేనే"

"ఏవీ కోటమ్మ జూదం ఆడిందా" ముక్కుమీదకి వేలు పోనిచ్చి అన్నది కాంతమ్మ.

"ఆవిడ యేరోజు అయితే మన గుమ్మం యెక్కిందో అప్పుడే అనుకున్నాను. కాని పొట్టకోసినా అక్షరంముక్క లేనిదానికి తొలిసారే ఫష్టుప్రయిజా" - అని ఆపైన మరి మాట్లాడలేకపోయాడు పంతులు.

లక్షింనారాయణ కూడా నిల్చోలేక చతికిలపడి ఆశ్చర్యపడ్డాడు

"ఏవి చేసుకుంటుందిరా - అంత డబ్బు" అన్నది కాంతమ్మ.

"తగలేసుకుంటుంది మనకెందుకు" విసుగుతో నసిగాడు పంతులు.

అయితే పంతులికి అనుభవం తక్కువ లక్షింనారాయణమాత్రం యీవిషయం అంత తేలిగ్గాతోసి పారేసేకొద్దనీ, యిందువల్ల తమకేమైనా లాభం కలుగగలదేమో ఆలోచిస్తే దారి దొరకగలదనీ అతను అభిప్రాయపడ్డాడు.

"మన కెందుకేమిటిరా వాజమ్మా. రేపే బందరుపోయి ప్లీడరుతో విచారించిరావాలె. కోటమ్మకు వారసులం మనమే నాయన. ఆ డబ్బు మనకు దక్కే వీలుంటే-"

తక్కినమాట పూర్తిచేసేలేదు కాంతమ్మ.

"రమ్మన్నారు తిమ్మన్న బంతికి - ఆవిడ బొట్టూ కాటుకా పెట్టి పిల్చి మీ చేతికి వప్పచెప్తుంది - తమ్ముడికి యిచ్చుకుంటుంది - మీ అన్న సంపాదించే సొమ్మా కాదుగదా" అన్నది.

"నోరుమూసుకో - అన్నిటికీ తగుదునమ్మా అని పంచాయితీ చెప్పొస్తావు" అని కాంతమ్మని గదమాయించి పంతులు వేపు తిరిగి అన్నాడు లక్షింనారాయణ "రేపే బందరు వెడుతున్నాను. తరువాత విషయాలు మళ్లీ ఆలోచించవచ్చు"

మర్నాడు రాత్రి పొద్దుపోయినతరువాత యింటికి చేరుకున్న లక్షింనారాయణ ప్లీడరుకూ తనకూ జరిగినప్లీడరు - పార్టీ సంవాదం వివరంగా కొడుకుతో చెప్పి అన్నాడు.

"ఆపజిలుకుకట్టిన సొమ్ము భర్త ఆస్తిలో చేరగదా అందువల్ల దానివల్ల వచ్చేలాభం కూడా ఆవిడ సొంతం కాదు - అది ఆమె తరవాత మనకి రావలసిందే."

"ఈలోపలే ఆమె ఆ డబ్బంతా బయటకు చేరేసి పప్పూ పెళ్లాలు చేసేస్తేనో" ప్రశ్నించాడు పంతులు.

"అదీ అడిగాను ప్లీడర్ని -" ముందు దావాచేసి ఆ సొమ్ము జప్తు చేయిద్దాం అన్నాడు!!

"ప్లీడర్లంతా అల్లాగేయేడుస్తారు దావా... దావా అని. కోసకి గెలిచేనా చచ్చేనా" అన్నాడు నిర్లిప్తంగా పంతులు.

"ముందు జప్తువస్తే ఆపైమాట చూసుకోవచ్చు . . అరెయ్ అబ్బాయ్ అదిగాక నాలుగుసార్లు కోర్టుచుట్టూ తిరిగేటప్పటికి రాజీనామా అంటూ తంతు నడిపి కొంత కాకపోతే కొంతయినా దక్కించుకునేందుకు సావకాశం వుంటుంది ఈ ముండ కోర్టుచుట్టూ తిరిగేనా చచ్చేనా"

పంతులు తండ్రివంక పరకాయించి చూచి అన్నాడు.

"అవుతే పెద్దయ్యతాలూకు పైకంతోటే పజిలుకు కట్టినట్లు మనకు సాక్ష్యమేది నాన్నా"

లక్షింనారాయణ కూడా ఈవిషయాన్ని గురించి మనసులో మధన పడుతూనే వున్నాడు. అయినా అతనికి మార్గాంతరం అవుపడకపోవటంవల్ల పేలవంగా అన్నాడు.

"ఆఁ అదిగాక కోటమ్మదగ్గర మరేవి డబ్బుందిరా."

"నిజమే అనుకో—అయినా ఋజువు భారం మన నెత్తినే వుందిగదా."

"ఆ మాట నిబద్దే—మరి కార్యాంతరం లేదే" అన్నాడు సగం చచ్చి లక్షింనారాయణ

అయితే యింతలోకే పంతులు మెదడులోకి ఒక అమోఘమైన ఆలోచన ప్రవేశించింది

"హాఁ .. అవును అల్లా చేస్తే చిక్కు లేదు కోటమ్మ వుచ్చులో చిక్కుకుంటుంది" అన్నాడు ఎగిరి గంతేసి.

"ఏమిట్రా ఆ మార్గం?" కొడుకును ప్రశ్నించాడు లక్షింనారాయణ.

ఆతరువాత పక్కా అరగంటసేపు తండ్రీకొడుకులిద్దరూ ఆంతరంగిక సమాలోచనలు జరుపుకొని పంతులు సూచించిన పద్ధతే సవ్యమైనదని నిర్ణయించుకున్నారు.

*        *        *

కోటమ్మగారికి అదేదో లాటరీలో లక్ష రూపాయలు వచ్చాయని ఆ వూళ్లో అబాలగోపాలానికీ తెలిసిపోయింది.

"కోటమ్మ అదృష్టవంతురాలు" అన్నారు కొందరు

"లక్ష్మి గుడ్డిది" అన్నారు మరికొందరు

"కోటమ్మకు యింగ్లీషు అక్షరాలుకూడా రావుగదా పజిలు ఎల్లా పూర్తిచేసిందీ, ఎల్లా గెలిచింది" అని సందేహం వెలిబుచ్చాడు ఒక నిత్యశంకితుడు.

"ఆ ముండ ఎల్లాగో తిని చావదు - ఆ డబ్బు ఎటొచ్చీ వారసులకి పోయేదే" అన్నాడొక ప్రాప్తకాలజ్ఞుడైన పరభాగ్యోపజీవి

కోటమ్మ యీ మాటలు విన లేదు. విన్నా వాటిని లెక్కచేసే స్థితిలో లేదు యిప్పుడు

(48 వ పేజీ చూడండి)

# విజ్ఞానవీధులు

## డాక్టర్

# జ్యోతిషము శాస్త్రమేనా?

## డాక్టర్‌గారికి సమాధానము

మచిలీపట్టణమునుంచి టి. వి సుబ్రహ్మణ్య శర్మగారు ఇలా వ్రాస్తున్నారు:

జ్యోతిషముమీద ఢీకొన్నారు వసంతరావు వేంకటరావుగారు విజ్ఞానవీధులు "డాక్టరు"గారు. ఆ తర్కవాదాలు నిజంగా రెండు మత్తగజాలు ఢీకొన్నవిధంగానే ఉన్నాయి. "జ్యోతిషము నిజమైనపుడు అవుతుంది; కొనపుడు కాదు; కనక జ్యోతిషము దెబ్బ గుడ్డెద్దుతాపు. ఇక నిజమంటే ఏమిటి" అని ప్రశ్నవస్తే - ఇద్దరు ఉద్దండులూ ఎలక్ట్రానుల విషయానికి పోయి, దానికి కణలక్షణాలు తరంగలక్షణాలు కూడా ఉన్నాయి అనే విషయంమీద విజ్ఞానవీధులలో విహరించి వీరిద్దరూ ఏ మాత్రం పరస్పరం దగ్గరకొచ్చారో! అసలు ప్రారంభించిన జ్యోతిషము ఎలక్ట్రానుగా మారి 'జ్యోతిషము నిజమైనపుడవుతుంది, కొనపుడు కాదు' అనే ద్వైవిధ్యానికిన్నీ, 'ఎలక్ట్రానుకణమూ అవుతుంది, తరంగమూ అవుతుంది' అనే లక్షణాన్నీ పోలికకు తెచ్చి - ఫిజిక్సు బుకాయింపైతే జ్యోతిషము దబాయింపు అని దెబ్బలాడి - చివరకు "నిజమంటే" అని ప్రశ్నించుకుంటూ కూర్చున్నారు. (అని మరి అభిప్రాయము!)

పదార్థ విజ్ఞానశాస్త్రము ప్రస్తుతము చక్కటి ప్రతినిధులను, ఉన్నత ప్రతిపత్తిని, వివిధ విధములైన గ్రంథ, ప్రయోగ, ప్రామాణ్యాన్ని కలిగిఉంది. ప్రస్తుత ప్రపంచంలో పదార్థవిజ్ఞానశాస్త్రం ఇన్ని విశ్వవిద్యాలయాలు, ఇంతమంది అనుయాయులు కలిగి, ఎన్నో సౌకర్యాలతో ఉన్నత స్థానాన ఉంటుంటే, జ్యోతిశ్శాస్త్రం కొందరు జిజ్ఞాసువుల ఉత్సాహముమాత్రమే ఆలంబనంగా, ఒక శాస్త్ర ప్రతిపత్తియే లేకుండా, ఒక క్రమపద్ధతి లేకుండా, కొన్ని వందల సంవత్సరాల క్రిందట ఈ "సైన్సు" ఉన్న స్థితిలో ఉంటున్నది. ప్రస్తుతం జ్యోతిషముయొక్క ప్రతిపత్తి ఏమిటంటే—అదొక తరతరాలు గావస్తున్న మూఢవిశ్వాసమని మాత్రమే. దానిమీద వైజ్ఞానికులలో ఒక పెద్ద "ప్రెజుడిస్" (వైముఖ్యము)—దాని గతచరిత్రనుబట్టిగానీండి, ప్రస్తుత స్థితినిబట్టిగానీండి బాగా ఏర్పడిఉంది. ఈ రెంటిని పోల్చడానికి పూనుకుంటే సంపూర్ణ రథికుడైన అర్జునుడు విరథుడైన కర్ణుడు యుద్ధముచేసినట్లుండును. ప్రస్తుతం జ్యోతిషముయొక్క స్థితిగతులు విరథయోధునికి సమానంగా ఉన్నాయి. దాన్ని ఆరాధించేవాళ్లకది ఒక వృత్తి క్రింద, వ్యాపారం క్రింద పరిణమించి, మోసం తప్ప శాస్త్రదృష్టితక్కువగా ఉన్న వాళ్ళ చేతుల్లో పడిఉంది.

వీళ్ళా శాస్త్రప్రతినిధులు? వీళ్ల జయాపజయాలమీద ఆధారపడి ఒక శాస్త్రముయొక్క సత్యాసత్యములమీద నిర్ణయం చేయబూనడం న్యాయం కాదు. దానిది చాలా గ్రంథసారస్వతము పోయింది. కొన్ని గ్రంథాలు నామావశిష్టములుగానే ఉన్నాయి. నిజంగా దానిలో ప్రావీణ్యము గడించి, ఆశ్చర్యచకితులుగా మనల్ని చేయగలవిధంగా ఫలితాలు చెప్పగలవారెవరైనా ఉంటే వాళ్లు చాలా "రహస్యంగా" గోప్యం, గోప్యం, మహాగోప్యం" అంటూ దాచుతున్నారు. అట్టాంటివాళ్లను వెదకి పట్టుకోవలసినట్లుంది. ప్రజాదరణ, ప్రభుత్వాదరణ, విశ్వవిద్యాలయాల ఆదరణ ఉంటేగాని ఏదైనా ఒక ప్రతిపత్తిని సంపాదించుకోడం కష్టం పోనీ "దీని అంతు కనుక్కుందాం" అని జిజ్ఞాసువులగు వ్యక్తులు బయలుదేరినా వారికి కావలసిన అంగబలం, అర్థబలం చాలా తక్కువగా ఉన్నాయి కాబట్టి ఏ కొందరు వ్యక్తుల స్వీయానుభవాలకు, విశ్వాసాలకు మాత్రం పరిమితమైయున్న దీన్ని వెలికిలాగి నిష్పాక్షికదృష్టితో సమగ్ర విమర్శనాత్మకమైన దృష్టితో, అర్థం చేసుకో ప్రయత్నిస్తే కొంత మంచి ఫలితం కల్గక తప్పదు. అలాంటి కృషి చేయనప్పుడు చేసే ఈ "తాత్కాలిక విమర్శలన్నీ" మ "గుడ్డెద్దుతాపులు"లాగే ఉంటుంటాయి.

జ్యోతిషం విషయంలో అన్ని ఫలితాలు గుడ్డెద్దుతాపులులాగే తగిలినాయి అనుకోడం మాత్రం మహా సాహసం. ప్రయోగసాత్మ్యము నిజము అని ఎలాగు ఢంకా బజాయించి చెప్తున్నారో అలాగే - ప్రస్తుతం ఈ శాస్త్రస్థితిగతుల్ననుసరించి కొందరు వ్యక్తుల అనుభవాలకే పరిమితమైన "ప్రయోగసాత్మ్యం" ఈ శాస్త్రానికి చాలా లభిస్తుంది. భవిష్యత్తు కాదు ఎలా తెగినా, గతంకూడా-ఏ మాత్రం వ్యక్తిని ఊహించలేని పరిస్థితుల్లో-జ్యోతిషశాస్త్ర సహాయంతో ఎలాగు ఒక జ్యోతిష్కుడు చెప్పగలిగాడూ? భవిష్యత్తు సాధించలేనంత మాత్రాన శాస్త్రాన్ని తిరస్కరించేదానికంటే - జననకాలం తప్ప వేరే విధమయిన ఎలాంటి ఉపబలం లేని ఈ జ్యోతిష్కులు ఏమాత్రం ఊహించలేని పరిస్థితుల్లో—గతం ప్రబల ఉదాహరణ పూర్వకంగా ఎలా చెప్పగలడు? అలాగు 'గతం మాత్రం వ్యక్తిపరోక్షంలో జాతకమాత్ర సహాయుడై ఈ జ్యోతిష్కుడు చెప్పగలగడం అపూర్వం కాదా? ఇలాంటి సన్నివేశాలు అనేకం మనకు విచారిస్తే దొరుకుతాయి. కాని ప్రస్తుతం సమాచారమంతా క్రోడీకరించి, నిగ్గు తేల్చుకోగల అవకాశం లేదు. అందువల్ల కొందరు వ్యక్తుల అనుభవాలకు విశ్వాసాలకుమాత్రం పరిమితమైయున్న జ్యోతిషం - గుడ్డెద్దుతాపులనుకోడంలోనూ ఒక పరిమితి ఉంది—సక్రమ పరిశోధనను కొనసాగించి, ఒక సక్రమసంస్థ ద్వారా నడిపిస్తే, దానికుచితమైన శాస్త్రమర్యాదను—టెస్టుట్యూబుల శాస్త్రమర్యాద రాకపోయినా, ఊహామాత్రస్థితి గల్గియుండీకూడా విశ్వవిద్యాలయాల్లో ఆసనము పొంది గౌరవింపబడే ఇతరశాస్త్రాల పాటి మర్యాదఅయినా—పొందగలదు. ఈ రిశోధనద్వారా ఒకవేళ అంతా దగా అనిని బుజువైందనుకోండి—అప్పుడు జ్యోతిషం పఎలాగూ చస్తుంది. దానివల్ల లాభమే కానష్టము ఏముంటుంది?

* * *

శ్రీ సుబ్రహ్మణ్య శర్మగారు ఆధునిక వైజ్ఞానికులకును వారి అనుయాయులకును జ్యోతిషముపై వైముఖ్యము కలిగినదన్నారు. విజ్ఞానవీధులలో ఇంతవరకూ

(55 వ పేజీ చూడండి)

"ఉందిలేవే. నీదంతా పిడరు ప్రశ్నలు. నేను నిన్నేం అడగటంలేదులే. నాన్న ఇస్తే కొనుక్కుంటా. లేకపోతే లేదు!" అన్నాడు మనవడు గొణుగుడుగా.

"నేనే ఇస్తాలేరా! పొద్దున్నే తీసుకెళ్దువుగాని! అప్పుడే అలిగావేంరా! నా తండ్రీ" అంది ముసలమ్మ, మసకచూపుకి సరిగ్గా కనపడని మనవడి విశాలమైన వీపు నిమురుతూ తృప్తిగా.

మనవడి మొహం వికసించింది.

# 40

వరదరాజు వచ్చేమేడ గది కాపరం ఇంకా వొదిలిపెట్టలేదు. ఒదిలెయ్యాలని అతనికి అనిపించటంలేదుగూడా, చిన్నా— అతనికి అంత అప్తుడైపోయినాడు. వరదరాజును ఒక్కరోజు చూడకపోతే ఆ కుర్రాడు గిలగిల్లాడుతాడు. వరదరాజుకీ ఏమీ తోచదు. అతను కలప అడితీలో ఉండే నాలుగు గంటలసేపు మినహాయిస్తే ఇంక రోజంతా ఈ గదిలోనే గడుపుతున్నాడు.

మధ్యాహ్నం వరదరాజు గదిలోఅడుగు పెట్టేప్పటికి కుర్రాడు గడపలో కూర్చునివుంటాడు, చిన్న గడ్డంకింద చేతులానించి అటూ ఇటూ చూస్తూ. చలికాలపు మధ్యాహ్నపు ఎండ గడపకి ఎడంవేపున బాదంచెట్టు ఆకుల్లోంచి కుర్రాడి లేబుగ్గలమీదా, రేగిన నల్లని జుట్టుమీదా పడి ధగధగలాడుతోంది

వరదరాజు రిక్షాదిగి ఈలవేస్తూ "చిన్నా! నిద్రపోలే?" అంటూ లోపలికొచ్చాడు.

కుర్రాడు లేచి నిల్చుని "మామా! కొయి!" అని అరుస్తూ, అతని చేతివేలు పుచ్చుకుని లోపలికెళ్ళాడు వరదరాజు తను తెచ్చిన ఆపిల్ కుర్రాడికిస్తూ, "చిన్నా! బువ్వతిన్నా?" అంటూ చిరిచాపమీద కూర్చున్నాడు.

"తినా! తినా! పప్పూ!" అంటూ కుర్రాడు ఆపిల్‌పండు కొరుక్కు తింటున్నాడు. మధ్య మధ్య తింటంమాని వరదరాజు వంక చూసి నవ్వుతున్నాడు.

వరదరాజుకి ఆ కుర్రాడి చలాకీతనానికీ, ముద్దొచ్చే వర్చస్సుకీ ఎంతో ఆశ్చర్యం వేస్తున్నది. "చిన్నా! నాతో వచ్చేస్తావా మా యింటికి?" అని అడిగాడు, కుర్రాణ్ణి దగ్గరకి లాక్కుని వొళ్లో కూర్చోపెట్టుకుంటూ. "ఊహూం! ఆశే"అని తల అడ్డంగా వూపుతూ నాలిక బైటికిపెట్టి వెక్కిరించాడు చిన్నా. వరదరాజుకి నవ్వొచ్చింది. "అట్లా వెక్కిరించావా? తంతా!" అన్నాడు కుర్రాడివేపు చూపుడువేలు చూపిస్తూ.

కుర్రాడు గభీమని వరదరాజు మీసం పట్టుకుని లాగి, "తంతా! తంతా!" అన్నాడు.

వరదరాజు కుర్రాణ్ణి అమాంతం ఎత్తుకుని ముద్దాడాడు. ఇంకా పైకెత్తి "రాడీ! అన్నీ రాడీవేషాలే! వరదరాజంటే ఎందరో భయపడతారు! నువ్వు లెక్కచెయ్యవేంరా! ఎంత ధైర్యంరా నీకు!!" అన్నాడు కోపం నటిస్తూ.

కుర్రాడు తిరిగి తన బుల్లి వేలు ముక్కుమీద పెట్టుకుని, "తంతా! తంతా!" అంటున్నాడు.

వరదరాజుకి కుర్రాడితోటి ఈ ఆటలమధ్య ఒకసంగతి జ్ఞాపకం వచ్చింది. ఇవ్వాళ ఓ ముఖ్యవిషయం మాట్లాడ్డానికి శాస్త్రి వొస్తానన్నాడు. అతనికి ఎంత చీదరగావున్నా, ఎంత చిరాకుగావున్నా, డబ్బుతో గూడిన ఇలాంటిపన్నాహాలూ, అత్యవసర వ్యవహారాలూ తప్పటంలేదు. వాటిని అతను వొదిలించుకోవాలన్నా వొదిలించుకోలేకండాపున్నాడు. తనదగ్గిర డబ్బు కరిగిపోతేగాని తనకి విశ్రాంతీ, స్వేచ్ఛా లభించవేమోనని విచిత్రమైనభావం ఒకటి రానురాను అతనికి ఏర్పడిపోతోంది.

అక్కడ అడితీలో బ్రహ్మానందం అదేవేళటప్పుడు లెక్కలు రాస్తూ, బేరాలిస్తూ, వ్యాపారంలో మునిగి వున్నాడు. ఇప్పటికప్పుడే అడితీలో బేరాలు బాగా హెచ్చాయి. ప్రొప్రయిటర్ ఎటువంటివాడో అతనికి ఇంకా పూర్తిగా అవగాహన కాకపోయినా, దుబారామనిషి అని నిర్లక్ష్యస్వభావం కలవాడనీ ఊహించుకున్నాడతను. ఈ నాలుగునెలల్లో అడితీలాభాలు పదారువేలు కన్పిస్తున్నాయి. తను జీతంగాక రెండొందల్లు అధికం వాడుకున్నాడు. ఈసంగతి ప్రొప్రయిటర్‌కి చెబుదామనుకుంటే నెలనించీ పడటంలేదు. ఇంతవరకూ వరదరాజు లెఖ్ఖలైనా చూడలేదు...తన అవసరంకొద్దీ డబ్బు వాడుకున్నాడు; కోప్పడతాడేమో చివరికి?.. ఇవ్వాళ చెప్పేసెయ్యాలి ..

బ్రహ్మానందం, ఆలోచనల్లో వుండగానే ఏడుకొండలు అడితీలోకి వొచ్చి సర్వస్వతంత్రంగా అతనిపక్కనే కూర్చున్నాడు.

"ఏంకావాలి మీకు?" అని మర్యాదగా పలకరించాడు బ్రహ్మానందం అతన్ని.

"మీ ప్రొప్రయిటర్ ఏడీ? నాకో రెండొందలు కావాలి. పీకమీది కొచ్చింది" అన్నాడు ఏడుకొండలు చాలా చనువుగా; తాను మాట్లాడుతున్నది గుమాస్తాతోనన్న సంశయమన్నా లేకండా

బ్రహ్మానందం, వీడెవడు! ప్రొప్రయిటర్‌కీ వీడికీ ఏంసంబంధం! అని ఆలోచిస్తున్నాడు. ఏడుకొండలు టీడికావస్ పొయ్యి మసి—మరకలతో నిండిన నల్లనిచొక్కా లాగూ వేసుకుని వున్నాడు.

"వారు లేరే! ఇప్పుడే వస్తారు కూర్చోండి వొచ్చాక, వారు చెబితే ఇస్తాను" అన్నాడు గుమాస్తా నమ్రతగానే

"ఏందయా నువ్వు!. ." అని ఇంకేదో అనబోయి ఏడుకొండలు మళ్లీ సర్దుకున్నాడు. ఇది అడితీ అని, ఇక్కడ తను జాగ్రత్తగా మాట్లాడాలని అతనికి గుర్తుకొచ్చింది.

ఇదేసమయాన వరదరాజు అడితీముందు గుర్రబ్బండి దిగి, లోపల తనగదిలోకి వెళ్తూ ఏడుకొండల్ని చూసి ఒకనిమిషం ఆగాడు; "ఏం? ఇట్లా వొచ్చావు! లోపలికి రా, మాట్లాడదాం" అని హుందాగా అనేసి, చకచక నడిచి గదిలోకి వెళ్ళాడు.

ఏడుకొండలు పిల్లిలా అతన్ని అనుసరించాడు.

వరదరాజు కుషన్‌కుర్చీలోకూర్చుని, కాళ్లు టేబిల్ మీదపెట్టి సిగరెట్ వెలిగించి "కూచోరా అట్టా!" అన్నాడు ఏడుకొండలికి ఓకుర్చీ చూపిస్తూ. ఏడుకొండలు కొంచెం జంకుతూ గదినంతా కలయచూస్తూ, కుర్చీలో అనీ అననట్టు కూర్చున్నాడు.

"ఏందిరా, కొత్తగా తిరనాళ్ళకొచ్చినోడల్లే చూస్తున్నావు?" అంటూ నవ్వాడు వరదరాజు. ఒకగుక్క పొగపీల్చి, జేబులోనించి గోల్డ్‌ఫ్లేక్ ప్యాకెట్ తీసి ఏడుకొండలకిచ్చి "వేళకాని వేళొచ్చావేం? ఏంపని?" అని ప్రశ్నించాడు.

ఏడుకొండలు "నువ్వేమో ఈడ కులాసాగా పొగలాగుతా కూచున్నావు! అడ నాప్రాణం అల్లాడిపోతంది! ఏందిరా! అది టీకొట్టంట్రా? ధర్మసత్రం అయిపోతేనూ!" అన్నాడు, తానూ సిగరెట్టు వెలిగించి.

"అయితే ఏందంటావ్? ఏం మునిగిపోయింది? పైకం కావాలంట్రా? అదేనా నీ ఏసుపు?" అని ఎదురు ప్రశ్నించాడు వరదరాజు.

"వారంనాడు రూంకాడ ఇచ్చానే పైకం, అది నిన్నటితో కా ఖరిపోయిందిరా! మళ్లీ ఇయ్యాల్టికి అన్నీ ఖాళీ! రోజూ

పాతికమంది తరిమింటూవుంటే ఏం మిగులుద్దిరా జూడిద!" అన్నాడు ఏడుకొండలు. టీకొట్టు నష్టంలో నడుస్తుండడం అతనికి బాధగా వుంది; కాని చేసేదిలేదు. అందువల్ల టీకొట్టు తీసెయ్యటానికి వీలు లేకండావుంది. డబ్బులేమో వరదరాజు ఇస్తూనే వున్నాడు...

వరదరాజు, "ఒరే వుండరా! నీకేం కష్టంరా! నేనిస్తున్నాగా డబ్బులు! తిననీ వాళ్లని! అంతే! ఇంకేమీ మాట్లాడకు!" అని, "ఏమండోయ్ పంతులుగారూ!" అని బ్రహ్మానందాన్ని కేకేశాడు.

బ్రహ్మానందం చేతిలో రాస్తూరాస్తున్న పుస్తకంతో వచ్చాడు. అతను వొచ్చి ఎదురుగా నిలబడగానే, "పంతులుగారూ! ఈయనకి వారానికి రెండొందలివ్వండి!—" అని ఆజ్ఞాపించి, "ఏడుకొండలూ, వెళ్లవోయ్!...వారం వారం తీసుకెళ్లు!" అన్నాడు. తన ఇద్దరి సంబంధమూ గుమాస్తాకి తెలియడం అతనికిష్టం లేదు. ఏడుకొండలు లేచి వెళ్ళాడు.

పది నిమిషాలతర్వాత బ్రహ్మానందం, జమా ఖర్చుల పుస్తకం పట్టుకుని గదిలోకొచ్చాడు తాను డబ్బులు ఎక్కువ వాడుకున్న పరిస్థితినీ, అవసరాన్నీ షావుకారుకి నచ్చచెప్పాలని, అప్పటికి పది సార్లు లోలోపల రిహార్సలు వేసుకున్న మాటల్ని పైకనటానికి ధైర్యాన్ని కూడదీసుకుంటూ గొంతు సవరించుకున్నాడతను.

"ఏమిటండీ పంతులుగారూ! ఏమిటి విశేషం!" అని ప్రశ్నించాడు వరదరాజు.

బ్రహ్మానందం మెల్లిగా ప్రారంభించాడు. "మీరు కోప్పడకండా వుంటే—" అని అన్నాడు; పైన మాట పెగలటంలేదు. వరదరాజు నవ్వుతూ, "చెప్పండి, ఫరవాలేదు" అన్నాడు నవ్వుతూ.

"పోయిన నెల మా నాన్నగారికి జ్వరం తగిలింది; డాక్టరుకీ-మందులకీ అవసరమై రెండొందల రూపాయలు మిమ్మల్నడగకుండా వాడుకున్నానండి ..లెఖ్ఖ రానివుంచాను......" అన్నాడు వరదరాజువంక చూడకుండా, నేలచూపులు చూస్తూ.

వరదరాజు గుమాస్తా బాధ గమనిస్తున్నాడు. అతనికి నవ్వొస్తున్నది. "పోనీండి! వాడుకుంటే వాడుకున్నారు ... నన్నడిగితే కాదంటానా? ... భయపడకండి! ఇప్పుడిచ్చే జీతం సరిపోవటంలేదా? చెప్పండి!" అన్నాడు. జీతం చాలక ఏమైనా బాధ పడు

#  అపస్వరాలు 

చూస్తున్నాడేమో, గుమాస్తాకి...నమ్మకస్తుడు...పాపం! అతను లేక పోతే ఈ వ్యాపారంలో తనకేం తెలుసు?

బ్రహ్మానందానికి ఆశ్చర్యం ఆనందం వొక్కసారి కలిగాయి. చెట్టేచివాట్లు చాలుగా తిని, నరిపెట్టుకుందా మనుకుంటూంటే జీతం చాలదా! అని అడుగుతున్నాడే ఈయన! చాలా మంచి వాడులా వున్నాడు.. ఇలా ఆలోచిస్తూ ఏమీ అనలేక నిలబడ్డా డతను.

వరదరాజే కలిగించుకున్నాడు. "ఇంకో పాతిక రూపాయలు ఈ నెలనించి ఎక్కువ తీసుకోండి. మీరు వాడుకున్న రెండొందలూ తిరిగి ఇవ్వక్కర్లేదు. వ్యాపారం మాత్రం జాగ్రత్తగా చూసుకోండి" అన్నాడు.

బ్రహ్మానందం గుడ్లప్పజెప్పి నుల్చున్నాడు. ఏమిటీ అదృష్టం తనకి! ఈ రెండొందల బాకీ తీర్చడెట్లాగని నెలనించీ సతమత మౌతూ న్నాడు. ఆసమస్య చిటికెలో పరిష్కారమైపోయింది .

వరదరాజు "వెళ్ళండి పంతులుగారూ స్టేషన్‌కెళ్ళి వాగిస్తు వొచ్చాయేమో కనుక్కురండి .. పంతులుగారూ, అక్కడ ఎవరన్నా వుంటే ఫ్లాస్కులో కాఫీ తెప్పించండి" అన్నాడు.

బ్రహ్మానందం వెళ్ళిపోయినాడు.

మరోక ఐదునిమిషాలకి అడితీ బైట కరుణమూర్తి కారుఆగింది. అందులోంచి కరుణమూర్తీ, అతని స్నేహితుడు రమేశం, శాస్త్రి గారూ, ముగ్గురూ దిగారు.

కారుచప్పుడు వినికూడా వరదరాజు లేచి బైటికి పోలేదు. అలాగే కూచున్నాడు గొలుసు వరుస నికరెట్లుతగలేస్తూ ఇంతలో బ్రహ్మానందంపంపిన కుర్రాడు ఫ్లాస్కులో కాఫీ తెచ్చాడు.

ముగ్గురు అతిథులూ లోపలికి వచ్చారు. వరదరాజు కాఫీ తాగుతూ, "కూర్చోండి" అని సంజ్ఞచేశాడు శాస్త్రి గారికి. ముగ్గురూ కూర్చున్నారు.

"ఏమండి వరదరాజుగారు! నిన్న క్లబ్‌కి వస్తానన్నారు! రానేరాలేదు! చూసిచూసి కళ్లు కాయలుకాశాయి!" అని ప్రశ్నిం చాడు శాస్త్రిగారు

వరదరాజు నిన్న క్లబ్‌కి వస్తానని మాట ఇచ్చాడుగాని సాయంత్రం అయ్యేప్పటికల్లా మొగల్రాజపురంలో తన కత్యంత ప్రియమైన మండపందగ్గరకి వెళ్ళి కూర్చున్నాడు. మనశ్శాంతి కదే మంచిప్రదేశంగావుంది అతనివరకూ ..

వరదరాజు అందర్నీ ఒకసారి చూసి నవ్వాడు. "వేరే పని వుండి వెళ్ళానండి..." అన్నాడు. "మరి...శాస్త్రిగారూ! నేను నిన్న చెప్పానే ఇంటిసంగతి కనుక్కున్నారా?" అని ప్రశ్నిం చాడు. కరుణమూర్తి మధ్యలో కలిగించుకుని "శాస్త్రిగారు నిన్న నాతో కూడా అన్నారు, మీకు ఒక ఇల్లు కావాలన్నారని. ఊళ్లో శివాలయం వీధి చివర ఒక మేడ అమ్మకానికొచ్చింది...అది వీరిదే..." అని రమేశం వేపు చూపించి, "మీకు నచ్చితే పైమాటలు తరవాత మాట్లాడుకోవచ్చు. ఈలోగా మీకు ఇల్లు కావాలంటే, ఆ మేడలో వుంటూవుండండి అభ్యంతరం లేదు. మనవాడే" అన్నాడు స్నేహ పూర్వకమైన స్వరంతో.

శాస్త్రిగారు "నిజమేనండి. ఇల్లు నేను చూశాగా. ఖరీదైన ఇల్లు. రెండంతస్తుల మేడ. చక్కనిగాలీ వెలుతురూ వస్తుంది. అంతా సిమెంటు కాంక్రీటుపని. చాలా గట్టికొంప" అన్నాడు.

వరదరాజు శ్రద్ధగా వింటున్నట్టే కనిపించాడు నాటకంలో నాయిక వేషం వేసిన కనకవల్లిని ఎంతతొందరలో అయితే అంత తొందరలో పెంకుటింటినుంచి మార్చెయ్యాలని అతనికి మన స్సులో వున్నది ఆకోరిక తనకి నచ్చలేదు...దానింటికి వెళ్లడం కూడా ఏదో బాధగావుంది...

"ఎంత చెబుతున్నారండీ?" అని ప్రశ్నించాడు వరదరాజు ఐదునిమిషాలైనాక. "ఆ—ఎంత!..."అని శాస్త్రిగారు రమేశం వేపు తిరిగి, "చెప్పవయ్యా! ఇల్లు నీది!"అన్నాడు, తనకేంసంబంధం లేనట్టే.

రమేశానికి శాస్త్రిగారూ కరుణమూర్తీ వరదరాజునిగురించి బాగా చెప్పివుంచారు—అతడు ఎటువంటివాడో అర్థం కావటం లేదనీ, డబ్బు ఎంతవుందో అదీ తేలలేదనీ, చాలా నిర్లక్ష్యంగా వుంటాడనీ, ఏవరసనైనా సరే అతని అంతు తేల్చుకోవాలనీ. అదంతా రమేశానికి నిమిషాన మరుపుకొచ్చింది. వరదరాజు ఆకృతీ, అతనివైఖరీ రమేశాన్ని కొంచెం చకితుణ్ణి చేశాయి.

రమేశం "ఎంతో నా! పాతిక వేలు..."అన్నాడు నిదానంగా.

శాస్త్రిగారు నిదానంగా వరదరాజువంక చూస్తూ కూర్చు న్నాడు.

వరదరాజు గదిబైట నిల్చునివున్న కుర్రాణ్ణి పిలిచి "ఒరేయ్, వెళ్లి మూడుకాఫీ, టిఫిన్ తీసుకురారా!" అని జేబులోంచి డబ్బులు తీసి ఇచ్చాడు. ఆ వెంటనే పక్కకు తిరిగి, "మా గుమాస్తాను రానివ్వండి. బయానా ఇప్పిస్తాను రేపే ఆ ఇంట్లోకి ప్రవేశిస్తాను. ముహూర్తం అదీ కొట్టించేవుందిగా!" అన్నాడు చాలా నిదానంగా.

శాస్త్రిగారికీ కరుణమూర్తికీ ఒక నిమిషం దిగ్భ్రమ కలిగింది. బేరం ఆడలేదు - అదీగాక ఇంతవరకు ఇతను ఆ ఇంటిని చూడ లేదు; ఎన్నిగజాలో, ఎంతఇల్లో అడగలేదు.. అప్పుడే బయానా ఇవ్వడం, రేపే అందులో ప్రవేశించడం!.. ఇదేమి కారణమో!

రమేశం "ఇల్లంతా చక్కగా వుందండి. రేపే ప్రవేశించ వచ్చు" అనిమాత్రం అన్నాడు.

శాస్త్రిగారికి ఆశ్చర్యంతగ్గి, "రేపా? రేపటికేం? రేపు దశమి! దివ్యమైనరోజు! గృహప్రవేశానికి శుభం" అన్నాడు.

వరదరాజు "అయితే రేపే ప్రవేశిస్తాను. దస్తావేజు అదీ, శాస్త్రిగారూ! మీరే దగ్గరవుండి రాసి రిజస్టరీ చేయించాలి!" అన్నాడు.

ఇంతలో కుర్రాడు టిఫిన్ కాఫీలు తెచ్చి అతిథులు ముగ్గురి ముందూ పెట్టాడు. వరదరాజు బ్రహ్మానందంకోసం ఎదురు చూస్తు న్నాడు

టిఫినీలు పూర్తయినాక, తిరిగి సంభాషణ ప్రారంభమైంది.

శాస్త్రిగారు వక్కపలుకు నములుతూ, "ఇంక ఎలక్షన్‌లు రెణ్ణెల్లేవున్నాయి" అన్నాడు కరుణమూర్తి వంక తిరిగి.

"అవునండి. మనం ప్రచారకార్యక్రమం కొంచెం ముందు గానే ప్రారంభించాల్సి వుంటుంది!" అన్నాడు వల్లభరు.

వరదరాజుకి ఎలక్షన్ గొడవ చాలా కొత్త; వూరికే వింటూ కూర్చున్నాడు.

శాస్త్రిగారు, "నీకేమోయ్, నీ వార్డులో నీకు గెలుపు ఖాయం" అన్నాడు.

రమేశం నవ్వుతూ, "ఉపకారి కాకపోయినా, అపకారి కాదు. ఇంకో అర్హత పుటకతోనే వుందాయెను" అన్నాడు.

వరదరాజు, "ఏమిటది?" అన్నాడు.

"ఇంకేం వుంది? డబ్బు!" అన్నాడు.

వరదరాజు నవ్వాడు కరుణమూర్తి తాను కూడా నవ్వి, "వరదరాజు గారూ, మా రమేశం కొంచెం నోటిగుడుసువాడు లెండి అలాగే మాట్లాడుతూఉంటాడు. ఏమీ అనుకోకండి" అని నవ్వాడు.

వరదరాజు, "ఏమీ ఫర్వాలేదండి." అన్నాడు.

శాస్త్రిగారు, "రమేశం అన్నమాట నిజమేలే. డబ్బులేనిదే

మున్సిపల్ ఎలక్షనులో కౌన్సిలర్‌గా నిలబడ్డం తెలివితక్కువ" అన్నాడు.

వరదరాజు అందుకున్నాడు. "అయితే మీరుకూడా నిలబడరా?"

"ఆఁ! మనకెందుకొచ్చిన బెడదలెండి. మీలాంటి యువకులు గెలిస్తే, నేను గెలిచినట్టే" అన్నాడు శాస్త్రిగారు అర్థోక్తిగా.

రమేశం "అంతేనండి శాస్త్రిగారు! కరుణమూర్తి మీవాడయినప్పుడు, అతను గెలిస్తే ఒకటే, మీరు గెలిస్తే ఒకటేనా! ఇలాగే ఇంకో నలుగురు మీ చేతిలో వాళ్లు కౌన్సిలర్లయితే, కౌన్సిలే మీది, మున్సిపాలిటే మనదీనూ" అన్నాడు.

శాస్త్రిగారు మందహాసం చేస్తూ, "నిజమేనోయ్! నాకు ఇందులో స్వార్థం ఏమీ లేదుగాని, మనవాళ్ళు అనుకున్నవాళ్లు నలుగురు గెలిస్తే చూడాలని మహా ముచ్చటగావుంది సుమా! నే ననకూడదుగాని, వరదరాజుగారు మాత్రం సామాన్యులా! వారూ ఏదో వార్డులో నిలబడి కౌన్సిలర్ అయితే నేను బ్రహ్మానంద పడతాను." అన్నాడు మెల్లిగా.

వరదరాజు పకపక నవ్వాడు. తర్వాత "శాస్త్రిగారూ! మీరు పక్కనే వుండాలిగాని! ఏ పనైనా చేస్తానండి! డబ్బంటారా! దానికేం ఫర్వాలేదు!" అన్నాడు బహు నిర్లక్ష్యంగా. అతనికి ఏదో కొద్దిగా ఈమధ్య మునిసిపాలిటి అంటేనూ, కౌన్సిలర్లంటేనూ వినికిడిగా తెలుస్తోంది. అదొక హోదా.. అదొక దర్జా అనుకుంటున్నాడతను డబ్బెట్టి కొనుక్కోడం అంటే సరి, అతను దేనికీ వెనకాడేట్టులేదు—వెధవ డబ్బు ఎవరికీ తెలియకుండా, తనకే ఆశ్చర్యం కొల్పేట్టు పాపం పెరిగినట్టు పెరిగిపోతోంది ఇనప్పెట్టెలో. ఆరోజు మార్చిన ఆ డబ్బు ఈ రోజుకి తరగలేదు సరిగదా ఇంకా పెరిగింది; దాన్ని ఎలాగైనా ఖర్చు పెట్టాలి. ఎలాగైనా డబ్బుతో కొనగలిగే అన్ని సౌఖ్యాల్నీ కొనాలి మనశ్శాంతిని విశ్రాంతినీ సాధించాలి. అతనిలా ఆలోచిస్తూ వుండగానే శాస్త్రిగారు తిరిగి, "అనేమిటండి! మీరు కోరకపోయినా నా సహకారం మీకు వుండనే వుంటుంది కరుణమూర్తిగారితోపాటే మీరూ, నామినేషన్ పడెయ్యండి.." అన్నాడు.

వరదరాజు ఈలోగా గడపదగ్గిర కొచ్చిన బ్రహ్మానందాన్ని లోపలికి రావచ్చు అని సంజ్ఞచేసి, అతనికి రమేశాన్ని చూపిస్తూ, "వీరికి ఓ వెయ్యిరూపాయలు బయానా ఇచ్చి, వారి యింటిని నాకు అమ్ముతున్నట్టు—రసీదు రాయించండి వివరాలు వారే చెబుతారు" అన్నాడు. బ్రహ్మానందం తలవూపి వెళ్ళాడు రమేశం అతన్ని అనుసరించాడు

ఇంతలో కరుణమూర్తి చేతిగడియారం వంక చూసి, "శాస్త్రిగారూ మనం, క్లబ్బుకి వెళ్ళవద్దూ? నాలుగైంది?" అని హెచ్చరించాడు.

శాస్త్రిగారు "మీరూ వస్తారా? వరదరాజుగారూ?" అని అడిగాడు.

వరదరాజు "నాకు వేరే పనులున్నాయండి ఓ గంటాగి వస్తాను" అన్నాడు.

శాస్త్రి కరుణమూర్తి బయలుదేరారు. రమేశాని కింకా పని వుండడం మూలంగా, అతన్నిక్కడే వొదిలేసి, కారులో క్లబ్బుకి బెలుదేరారు ఇదరూ. కారు గవర్నర్‌పేటవేపుగా విశాలమైన సిమెంటురోడ్డుమీద పరిగెత్తుతోంది, శీతాకాలపు సాయంత్రపు యెండ కారు అద్దాలగుండా శాస్త్రిగారిమీదా, కారు డ్రైవ్ చేస్తూన్న వల్లభరుమీదా పడుతోంది.

శాస్త్రిగారు "వీణ్ని రంగంలోకి దించితే మన ఎలక్షన్ బడ్జెటు సగానికి సగం తగ్గుతుందోయ్ మూర్తీ! మన ప్లాను బాగో లేదూ?" అన్నాడు.

వల్లభగ్ కారు మెల్లిగా పోనిస్తూ, "మీ ప్లాను అమోఘం అని ఏనాడో చెప్పానుగదండి గురువుగారూ! అది సరేగాని, అతను గెలుస్తాడంటారా?" అని ప్రశ్నించాడు అనుమానంగా.

"గెలుస్తాడా, ఓడ్తాడా అనేది కాదోయ్ మనక్కావల్సింది. అతను ఏదో ఒక వార్డులో నిలబడ్డమే మనకి ముఖ్యం... అంతే. నా వుద్దేశం, అతన్ని సత్యనారాయణపురం లేదూ! ఆవార్డుకి నామినేషన్ పడేయించుదామని. ఆనిక్క గెలవనీ, చావనీ!... అతనికి పుష్కలంగా డబ్బున్నట్టుంది, డబ్బొదిలితే చీదర వొదులుతుందట! మహా మిడిసిపడుతున్నాడులే. మొన్నంటే మొన్న ఆ కనకవల్లికి వెయ్యిరూపాయల నగలు చేయించిపెట్టాడట! అది నోరు తెరిచి అడగటం తరవాయి!" అని ముక్కుమీద వేలు వేసుకున్నాడు శాస్త్రిగారు.

"అలాగునా శాస్త్రిగారు! అయితే ఇతనికి ఇల్లూ వాకిలీ, పెళ్ళాం పిల్లలూ లేరా ఏమండి?" అని ప్రశ్నించాడు కరుణమూర్తి.

"ఏమోనోయ్! నాకూ తెలియదు! ఎందుకుండరులే... ముండల్ని వుంచుకునేవాళ్ళందరూ, పెళ్ళాం లేకా పిల్లలు లేకనా, ఆపని చేస్తున్నారు? అదో దర్జా. అదో వ్యసనం... అంతేనా?"

"స్వానుభవం మరి!" అన్నాడు వల్లభర్. శాస్త్రిగారు నవ్వారు

క్లబ్బు సమీపిస్తూండగా శాస్త్రిగారు, "అబ్బాయి! నే నొక్కమాట అనుకున్నాను. ఈ వరదరాజే గనక ఈ ఎలక్షన్లో నిలబడ్డాడూ అంటే, మన పంట పండిందన్నమాటే. వాడిది పిచ్చి డబ్బు ..ఇంకోటి—మర్చిపోయినాను. రిజిస్టరీనాటికి మిగతా ఇరవైనాలుగు వేలూ తేగలడా? అని...అంతా ఒక్క సారి తెస్తాడా?" అన్నాడు.

కరుణమూర్తి, "అపాటి ధైర్యం లేకండా వ్యవహరిస్తాడంటారా? వ్యాపారస్తుడాయె! మీరు అతన్ని మరీ తక్కువ అంచనా వెయ్యకండి" అన్నాడు.

క్లబ్బుదగ్గిర కారు ఆగింది. (ఇంకా వుంది)



# మనూ...


మూలం :
**మానూ పరేదేకర్**

అనువాదం :
**యం. మంగతాయారు**


**ఈ** కథలో కల్పించిందల్లా పాత్రల నామధేయాలు మాత్రమే.

ఇప్పటికి యిరవైఅయిదేళ్ల క్రిందటి మాట. ఆ రోజుల్లో నేను రేడియోలో పిల్లల ప్రోగ్రామ్‌లు నడుపుతూండేవాడిని పిల్లల ప్రోగ్రామ్ లంటూ జరగడం అదే క్రొత్త. అదీగాక ఏ కొద్దిమందికో మాత్రమే రేడియోలు ఉండేవి. కాని ప్రోగ్రామ్ విన్న పిల్లలదగ్గరనుంచి ప్రతి వారం కొన్నికొన్ని ఉత్తరాలు వస్తూనే ఉండేవి వాటిల్లో పిల్లలు ఏవో ప్రశ్నలు అడుగుతూండేవారు వాటికి సమాధానం నేను మైకు వారం చెబుతానంటూండేవాడిని. ప్రోగ్రామ్ బాగోగులనిగురించి యే ఉత్తరమూ వచ్చినట్లు నాకు జ్ఞాపకం లేదు కాని ఒకరోజున మాత్రం చిత్రమైన జాబు ఒకటి వచ్చింది. దానిమీద అనాథాశ్రమం చిరునామా వ్రాసి ఉన్నది. ఈ తీరంలో:—

నేను ఇక్కడ ఉంటున్నాను. నాకు తల్లి దండ్రులు గానీ, బంధువులు గాని ఎవ్వరూ లేరు. మీరు అందరికీ మామయ్య నవుతా నంటారుగదా! నాకు గూడ ఎందుకు కారాదుకి ఇట్లు మీ మేనకోడలు

మనూ.

ఆపైన, నేనున్నచోటికి ఒకసారి రావల సినదని, నిజమైన మామయ్య వచ్చి నాకు కనిపిస్తాడా అని ఎవరో అమ్మాయి వ్రాసింది నాలుగే పంక్తుల ఉత్తరం. అయినప్పటికి స్పష్టంగా గుండ్రని అక్షరాల్లో వ్రాసి ఉన్నది. పిల్లల దస్తూరిలాగావున్నది.

మర్నాడు నేను అనాథాశ్రమానికి వెళ్లాను మేట్రన్ పిల్లని పిలుచుకువచ్చి 'ఇదుగో మీ మామయ్య' అన్నది. చూసీ చూడటంతోనే ఆపురుమన్నది దగ్గరకు తీసుకున్నా. ఓదార్చుతున్నకొద్దీ ఏడవటం మొదలెట్టింది. పది పన్నెండేళ్ళుఉంటయ్. బిడ్డ లక్షణంగా ఉన్నది ఆ ముఖంలోని అమాయకత్వం మాస్తూంటే నాకే దుఃఖం పొంగొచ్చింది. ఆ అమ్మాయికి తన తల్లి దండ్రులనిగురించి ఏమీ తెలీదుట. అయిదారేళ్లప్పుడు తనని ఎవరో ఈ ఆశ్రమంలో దిగబెట్టి వెళ్ళారుట తరువాత తను ఆ విషయాన్నిగురించి ఏమీ విచారించనూ లేదట. ఏమీ జాడా జవాబులూ గూడ తెలీలేదట. చూస్తేమాత్రం కులీనుల పిల్లలాగా ఉన్నది. కొంతసేపు మాట్లాడిన తరవాత ఎల్లాగైతే నేం నవ్వింది. నవ్వినప్పుడు రవ్వల్లాంటి ఆ పలువరుస ధగధగ మెరిసింది. కాని బ్రహ్మదేవుడు మాత్రం ఒక లోపం చేశాడు ఏమి టంటే-దిష్టి తగలకుండాఉండటానికి పెట్టాడేమో అన్నట్లు ఆ అమ్మాయి ఎడమ చెంప మీద - పావలా అంత పుట్టుమచ్చొకటి పెటాడు. ఆ ముఖంలో ఉన్న దోషమల్లా అదొక్కటే.

చాలా సేపు నేను ఆ అమ్మాయితో మాట్లాడుతూ కూర్చున్నాను. అంతసేపు చాలా సంతోషపడింది. కులాసాగా నవ్వింది దగ్గరలోఉన్న దుకాణానికి వెళ్లి మిఠాయి తెచ్చియిచ్చాను నా ఎదురుగుండా అప్పుడే తన సావాసకత్తె లందరికి పంచిపెట్టింది. తనవంతు చాలా కొంచెమే మిగిలింది. అది చూచి నేను మేట్రన్‌చేతికి కొద్దిగాడబ్బిచ్చి రోజూ అమ్మాయికి మిఠాయి తెప్పించిపెట్టే ఏర్పాటు చేశాను.

ఆశ్రమంలో ఉన్న పిల్లల్లో కొంతమంది నల్లగానూ, కొంతమంది మరీ అనాకారులుగానూ ఉన్నారు. వాళ్ళందరిలోకి ఆ అమ్మాయి శుక్రతారలాగా విశిష్టంగా ప్రకాశిస్తోంది. వారానికో రెండుసార్లకో ఒకసారి ఆశ్రమానికి వెడుతూండేవాడిని. వెళ్లేటప్పుడు యే పుస్తకాలో - మిఠాయో తీసుకువెడుతూండేవాడిని. నన్ను చూడగానే - మామయ్య వచ్చాడు - వచ్చాడంటూ సంబరంలో గంతులేసేది. నా అనే వాళ్లకోసం మొగం వాచిపోయిన అమ్మాయి మనస్సు యిప్పుడు కొంచెం కుదుటపడింది. పిల్లల్లో కలవకుండా వేరుగా యే గదిమూలో దిగాలుపడి కూర్చునేటువంటిది యిప్పుడు నవ్వుతూ కులాసాగా ఉంటున్నదని మేట్రన్ నాతో చెప్పింది. అమ్మాయిమీద నాకుగూడ బాగా మమకారం ఏర్పడిపోయింది.

ఈవిధంగా ఒక సంవత్సరం గడిచింది. తీరుబడి ఉన్నప్పుడల్లావెళ్ళి అమ్మాయిని చూసి వస్తూనే ఉండేవాడిని కాని ఒకసారిమాత్రం - దాదాపు రెండునెలలవరకూ వెళ్లేందుకు మొగులుబాటే లేకపోయింది. తీరా వెళ్లేసరికి - ఈసారి అమ్మాయి పరిగెత్తుతూ ఎదురురాలా. నే వెళ్ళగానే మేట్రన్ ఎదురైౖ ఎవరో సజ్జనుడు పాపం పిల్లలతో సంతానహీనుడు తున్నాడు. ఆయన అమ్మాయిని తీసుకువెళ్లాడు. మామయ్యని చూడాలన్నది. కాని మామయ్య - అంటే ఎవరో, ఎక్కడఉంటారో చెప్పలేకపోయింది. అని చెప్పింది. నా అడ్రసు మేట్రన్‌కూడ ఎరగదు

వెళ్లేటప్పుడు మామయ్యవస్తే మాయింటికి రమ్మనమని చెప్పమన్నది అన్నది మేట్రన్.

'మాయిల్లు' అని చెప్పుకోవాలని మనసుపడుతున్న ఆ పిచ్చిపిల్లకు యిల్లంటూ ఒకటి దొరికినందుకు ఆమాట వినీ వినటంతో నే నాకెంతో సంతోషం కలిగింది.

నేను మేట్రన్‌ని అడిగి వాళ్లయింటి అడ్రసుతీసుకుని అమ్మాయిని చూద్దామని బయల్దేరాను. కాని ఏంలాభం! ఆ సజ్జనుడు మరోఊరు మారాడు. పొరుగున ఉన్న వాళ్లని కనుక్కోగా వాళ్లు - నాగపూరో, కలకత్తాయో వెళ్లారని చెప్పారు.

కాని అడ్రసు తెలీదన్నారు.

అయితేనేం చేరగానే ఉత్తరం వ్రాయదా అనుకున్నాను.

కొన్నాళ్ళదాకా ఏరోజు కారోజు మనూ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ ఉండేవాడిని. చూస్తూ చూస్తూండగానే ఏడెనిమిది ఏళ్లు గడిచిపోయినాయి నా ఆలోచనలన్నీ గాలిలోకట్టిన మేడలైపోయినాయి. ఈపాటికి నన్ను పూర్తిగా మర్చిపోయి ఉంటుంది. పోనీలే, ఎక్కడో అక్కడ సుఖంగా ఉంటే చాలు.

నాగపూర్ కాలేజీ సాహిత్య పరిషత్తు నుంచి ఆహ్వానం రాగా నేను అక్కడ ఉపన్యాసం ఇవ్వటానికి వెళ్లాను. ఉపన్యాసం పూర్తికాగానే ధన్యవాదా లర్పించటానికి ఒక అమ్మాయి స్టేజిమీదికి వచ్చి నిలబడింది. ఆమె చెంపమీదఉన్న మచ్చనుచూసి మనూయేమో అనుకుని దగ్గరలో కూర్చునిఉన్న అధ్యక్షులవారిని ఆ అమ్మాయిపేరు తెల్సుకోవాలనే ఉద్దేశంతో అడిగాను. 'విజయా దలవీ' ఆమెను పెంపుచేసుకున్న తను దలవీ కావటంవల్ల ఆమె పేరుకూడ 'దలవీ' అనే పెట్టాడని ఆయన సెలవిచ్చారు.

వందేమాతరం సమాప్తం కాగానే నేను స్టేజి దిగి క్రిందికి వచ్చాను. వచ్చానో లేదో అంతే ఆ అమ్మాయి వచ్చి నా పాదాలమీద పడింది. ఆమె కన్నీటిలో నా పాదాలు తడిసిపోయినాయి. 'నువ్వు మనూ' వేనా అన్నాను. అవునన్నట్లు తల ఊగించింది. తృప్తిగా నావంక చూస్తూ మాటిమాటికి కళ్లు తుడుచుకుంటూంది. తరవాత ప్రొఫెసర్ గారితో మీ కేమీ అభ్యంతరం లేకపోతే మా మామయ్యని యింటిక తీసుకు వెడతానన్నది ఆయనేమీ అభ్యంతర పెట్టలేదు. మేము బయటకు వచ్చేసరికల్లా - ఒక చక్కని కారువచ్చి మాముందు ఆగింది. మనూ - నన్ను ఎక్కమని చెప్పి తనుగూడ నా పక్కన కూర్చున్నది. నావేపు ధీటుగా చూస్తూ, ఈ మోటారుకారు నాది. అన్నది. నిజం! ఈ కారు నిజంగా అనాధాశ్రమంలో ఉండే ఆ మనూదా? అనిపించింది.

అదృష్టం అతి విచిత్రమైనది.

నేను వాళ్ళింటికి వెళ్లాను. అమ్మాయి తల్లిదండ్రులని - అంటే పెంపుచేసుకున్న వాళ్ళని చూచాను. వాళ్ళిద్దరూ కూడ చాల సహృదయులు. నాకు-మనూకి ఉన్న బాంధవ్యాన్ని వాళ్ళు ఎరగరు. చిన్నప్పటి మాట అలా ఉంచు, పెద్దదానివైనావ్, కాలేజీలో ప్రవేశించి చదువుతున్నావ్, అయినా రెండు పంక్తుల ఉత్తరం వ్రాయకపోయావ్. నేనంత అనామధేయుణ్ణి కానుగా — అన్నాను మనూతో. ఈమాట అనేప్పటికల్లా అమ్మాయి కళ్లు చెమ్మగిల్లాయ్. నాన్నగారినే అడగండి అన్నది. నేను ఆయనవైపు ప్రశ్నార్థకంగా చూసేప్పటికి ఆయన, క్షమించండి. అమ్మాయి రోజూ రేడియో అడ్రసుకైనా ఒక ఉత్తరం వ్రాయమని పోరుతూనే ఉన్నది. కానీ..... ఏమిటో నేనూ వ్రాయలేదు. అమ్మాయిని గూడ వ్రాయనీ లేదు. అదిమాత్రం నా ఆజ్ఞను పాటించింది అందువల్ల తనకి బాధగాగూడ ఉండేది. ఆ సంగతి నాకు తెలుసు. అయినప్పటికీ ఈవిడ చరిత్ర బయటపడకుండా ఉండాలని నేనంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించాను. ఇందుల కింకోకమాటు గూడ క్షమించమని వేడుకొంటున్నా నన్నారు.

ఆ రోజంతా నే నక్కడే ఉన్నాను. అమ్మాయి చాల సుఖంగా ఉన్నది. పెంపు చేసుకున్న ఆ తల్లిదండ్రులుగూడ ప్రతి వాళ్ళతో అమ్మాయిని 'కన్నబిడ్డ' అనే చెప్పుకుంటున్నారు.

అమ్మాయి కాలేజీలో క్లాసు ఫస్టుగా వస్తూండేది. ఆ ఏడు బి. ఏ. పరీక్షకు కూర్చోబోతుంది. తనుగూడ వాళ్ల కన్నబిడ్డనుగానే భావించుకునేది. అధ్యక్షుమహాశయుడు అమ్మాయి పేరునిగురించి చెప్పిన మాట విన్న తరువాత యిక పట్టలేకపోయింది లేకపోతే ఆ నాటివరకూ గూడ తన సంగతి బయల్పడటానికి ఇష్టపడేది కాదు. మొదటి నుంచీ అమ్మాయిమీద నాకు మమకారం ఏర్పడింది. అమ్మాయి సౌఖ్యాన్ని చూసేప్పటికి నాకూ పట్టలేనంత ఆనందం కలిగింది. ఆరోజు అమ్మాయి మాటలతో ఎంతో సంతోషంగా గడిచిపోయింది. వాళ్ళ నాన్న మట్టుకు - అమ్మాయి సంగతి ఎక్కడా బయట పెట్టనని అనిపించి నాచేత ఒట్టు పెట్టించాడు. నేనూ అందుకు ఒప్పుకున్నాను.

మర్నాడు నేను బొంబాయి బయల్దేరాను. ఆ మాసాలు గడిచిన తరువాత మంచి వంశంలో పిల్లవాడు, ఇంజనీయరుకిచ్చి అమ్మాయి వివాహము కాబోతున్నదని నా కొక ఉత్తరం వచ్చింది. నేను కొత్తగా వెలువడిన నా పుస్తకాన్ని కానుకగా పంపాను.

ఒక ఏడాది అయింది. ఇంతలో ఆమె తండ్రి స్వర్గస్థులైనారు ఆతరువాత కొద్ది రోజులకే తల్లికూడ పోయింది. ఆయన విల్లు రాసివ్వకపోవటం మూలాన ఆ ఆస్తంతా ఎక్కడో మేనల్లుడికి దక్కిందని, ఈ సంగతి నాకు తెలిసిన ఒక నెలకల్లా అమ్మాయిదగ్గరనుంచి త్వరగా రావలసిందని రెండో ఉత్తరం వచ్చింది. కారణం వ్రాయలేదు. ఉత్తరంమీద పడిన కన్నీటి చుక్కలు చూసేప్పటికి నా గుండె దడదడలాడింది. కాసేపు ఏం కష్టం వచ్చి పడిందో అని విచారపడ్డాను. ఉత్తరం అందినవెంటనే కలకత్తాకి బయల్దేరి వెళ్లాను. అమ్మాయి భర్త పనిచేసే కంపెనీ అక్కడే ఉన్నది. నేను మహారాష్ట్రమండలిలో దిగుదామని వెళ్ళేప్పటికి ఆశ్చర్యం! అమ్మాయికూడ అక్కడే ఉన్నది. నన్ను చూసేటప్పటికి ముఖకవళికే మారిపోయింది. ఏడుపు ఆపుకోడానికి యథాశక్తి ప్రయత్నం చేస్తోంది. నేను అమ్మాయిని నాగదిలోకి తీసుకువెళ్ళాను. వెళ్లీ వెళ్లటంతోనే అమ్మాయి కన్నీళ్ళకి కట్టు తెగిపోయింది వెక్కి వెక్కి ఏడవటం మొదలెట్టింది. నేను మెదలకుండా కూర్చున్నాను. ఆ ఉద్వేగం కొంచెం తగ్గినతరువాత ఎక్కడుంటున్నావని అడిగాను. నన్ను ఇంట్లో నుంచి వెళ్లగొట్టారన్నది.

ఎవరు? మీ ఆయనేనా అన్నాను.

తల ఊగించి అవునని ఊరుకున్నది. ఆమె మాట్లాడేదాకా మెదలకుండా ఊరుకున్నాను. కొంచెంసేపైనతరువాత ఇల్లా చెప్పటం మొదలెట్టింది - తమ యింట్లో వాళ్లు ఎక్కడికో వెళ్లారట. తన అత్త గారితో అనాధాశ్రమ మేట్రన్ కలిసిందట. బహుశా వాళ్లిద్దరికి పూర్వపుపరిచయం ఏమైనా ఉండేమోగాని ... మాటలసందర్భంలో అసలు సంగతి బయటపడిందట. పిల్ల అనాధాశ్రమంతాలూకని తెలిసిన తర్వాత అందరూ - ఏకపట్టున మండిపడ్డారు. ప్రేమించేఆయనకూడ అల్లాగే ... నిప్పులు కుమ్మరించారు. ఇక అత్తగారైతే ఇది మాలదో, మాదిగదో, తురకదో, దూదేకులదో, అసలు హిందువల్లే లేనేలేదంది. అంటూ అమ్మాయి ఏడవటం మొదలెట్టింది. చివరికి ... ఆయనకూడ నెట్టివేసినతర్వాత ఆమాటే నిజమేమో అనిపించింది. ఆఖరిసారి అందరికాళ్ళకు నమస్కారంచేసి యిల్లువిడిచి ఇక్కడికివచ్చానని జరిగిన కథంతా చెప్పేసింది.

మళ్లీ మునుపటిలాగా అనాధనైనాను. ఈసమయంలో నాకు సహాయపడేవాళ్లెవరా అని ఆలోచించా ... మామయ్య ఉన్నాడుగా. ఆయనకే ఖబురు పంపా. ఆయనకూడ వచ్చాడు. ఇకముందేం జరగనున్నదో... .

ముందేం జరగనున్నదంటున్నావా? మీ నాన్నఆస్తి ఎవరికైనా దక్కనీగానీ ఆయన నీకు చదువు చెప్పించారు. ఇప్పుడు నీవు ఆకలితో చావవలసిన అగత్యం లేదు. బొంబాయిలో ఎల్లాంటివాళ్లకైనా జీవనోపాధి దొరుకుతుంది. నీకూ ఎక్కడో అక్కడ ఉద్యోగం దొరుకుతుంది. నాతో పద. అన్నాను.

అమ్మాయి నాతో బొంబాయి రావటానికి ఒప్పుకున్నది. ఇంటినుంచి ఉట్టి చేతులతో బయటకు వచ్చింది. వచ్చేస్తున్నప్పుడు గూడ పెనిమిటికి — అమ్మాయితో రెండు మాటలు మాట్లాడవలసిన అవసరమున్నా కనబడలేదు గాబోలు. అమ్మాయికి తల్లిదండ్రులు గతించారన్న సంగతి గూడ వాళ్ళకి తెలుసు. కాని వెళ్ళ ఎక్కడ

(26-వ పేజీ చూడండి)



## 1

జార్జిటౌన్,
10-1-55

ప్రియమైన కల్యాణికి,

అనేక ఆశీర్వాదాలు. మీ ఊళ్ళో పోస్టాఫీసుగాని మూసేశారేమిటి? అయినా అటువైపు విషయాలు గాలికూడా ఇటు వీచడంలేదు

మా ఇంటి ఆనవాయితీ ప్రకారం నీవు కూడా తొలి కాన్పుతో ఒక ముద్దుల మనవరాల్ని ప్రసాదిస్తావని మా అమ్మ ఎంత సంబరపడిందనీ. పైగా దేవీ అష్టోత్తరాలూ, లలితా సహస్రనామాలూ వెదకి వెదకి - "యోగీశ్వరి అని పేరుపెట్టమని రాయరా... దేవి పేరూ అదీ శుభంగా వుంటుంది" అన్నది మా అమ్మ. నీవేమిట్రా అంటే కేవలం 'అత్త చెప్పడమూ - నేను వినడమూ నా?' అన్నట్టు ఇద్దరు మొగవెధవాయిలని కని కూచున్నావు. పైపెచ్చు వాళ్ళిద్దరికీ ప్రభాకరం, దివాకరం, అని పేర్లు కూడా పెట్టేసుకున్నావు. మా అమ్మ ఉత్సాహం కొంత దెబ్బతింది. తన కోడలు అయినా ఇంటింటి మొండిఘటమని ఆమెకు తెలిసిందికాగు అయినప్పటికీ ఆవిడ అంటోంది కదా "పోతే పోనియ్యరా! ఏదో ఒకటి తల్లీ పిల్లలూ సుఖంగా వున్నారు; అదే పదివేలు. కాగి యోగీశ్వరి కని కొన్న సిల్కుబట్ట కల్యాణికి పంపించు. పోనీ అయినా పుట్టించుకుంటుంగి... అమ్మయికి పురుడొచ్చి రెండు మాసాలు కావస్తున్నదే. ఈపాటికి చంటివెధవల మొహాల్లో పోలికలు తెలుస్తుంటాయి ఎవరి పోలికలుంటారో? మనింటి పోలికలయితే శుభంరా అబ్బాయ్! నీ పెళ్లాన్ని అబ్బాయిలిద్దరూ ఎవరి పోలికో కొంత గమనించి వెంటనే రాయమనరా!"

ఆ సిల్కుబట్ట పంపింగమంటావా ఏమిటి? వెంటనే మీ అందరి క్షేమం తెలుపుతూ జవాబు రాయి.

పుత్రకుంకలు ఎవరిపోలికో రాయడం మరచిపోకేం.

నీ ప్రియమైన
లోకనాథం

[illegible]

## 2

ఒంగోలు,
15-1-55

మ-రా-రా-శ్రీ, భర్త గారికి

నమస్కారములు ప్రేమతో రాసిన ఉత్తరం అందింది మాఊళ్లో పోస్టాఫీసు మాయలేదుగాని మీ ఊళ్లో పోస్టలువాళ్లు కొంత సావకాశంగా పనిచేస్తున్నట్టున్నారు మరి నేను మీకు నాలుగోతారీఖున రాసిన ఉత్తరం అందకపోవడానికి కారణం?

పిల్లలపోలికల్ని గురించి మీకు రాద్దామనుకుంటూనే మరచిపోతున్నా. అదీకాకుండా నాకు తోచింగేదో నేనురాస్తే గొప్పలు చెప్పుకుంటున్నాననుకుంటారేమోనని మా అమ్మమ్మనడిగాను. "నీ మొగుడింటి పోలికలుగాక మరెవరివి తేవ్రిదానా!" అందావిడ. నవ్వుతున్నప్పుడు ఇద్దరు వెధవలూ అచ్చం మీలాగే వుంటారట ఏడుస్తున్నప్పుడు మా అమ్మలా వుంటారు. మీ ముద్దుకుమార్లను ఆట్టేసేపు ఏడవనివ్వడం లేదులెండి! ఎలాగో తంటాలుపడి నవ్వుదాయించి సదుకోబెడుతుంటా

ఆ సిల్కుబట్ట గనుక దయతో వెంటనే పంపిస్తే శివప్రకాశ్ కథ మరచిపోతాను. మా అమ్మమ్మ మనసు ఎంత మెత్తనిదనీ! ఏకురింటో వున్న పద్మ పెళ్ళయిన పదేళ్ళలోనూ ఆరుగురు అమ్మాయిలని కన్నది ఈ ఏడాది ఏ ఉగాది నాటునో ఈ సిల్కుబట్ట పద్మకిస్తే ఈసారయినా మొగపిల్లాణ్ణి కనవొచ్చని అమ్మమ్మ ఆశ, ఆశిస్తున్నాకూడా. అంచేత ఆ సిల్కుబట్ట పంపండి

మీ ఆరోగ్యం జాగ్రత్త. వారమినాళ్లూ కాల్చి ఏదో ఒకటి తెచ్చుకుని 'నేనేం చేయను కల్యాణీ' అనకండి ఇహామీద మీరు ఇద్దరు పుత్రులతండ్రి అన్న విషయం గుర్తుగా ఉంచుకోవడానికి ప్రయత్నించండి

వెంటనే జవాబు

మీ ప్రియమైన
కల్యాణి.



తైర్థికులు

—ఫొటో: వై. రామకృష్ణారావు, బందరు.

# 3

జార్జిటౌన్,
20-1-55

.. 'అమ్మాయి లిద్దరూ నాపోలికేనట' అనేసరికి మా అమ్మ ఎంత ఉబ్బిపోంగిపోయిందో! ఆవిడ అంత అనురాగంతో వుండగా నీ వెందు కిలా కాలేజిఅమ్మాయి గా కస్సుబుస్సుమంటావూ?

మా అమ్మకిప్పుడు మరో దిగులు పట్టుకుంది "అది సరేగాని, అబ్బాయ్! మన కల్యాణి చురుకయిన పిల్లే అనుకో. అయినా పసిపిల్లకదా దానికేం తెలుస్తుందిరా? ఇద్దరు మనుమరాళ్ళు ఒక్కలాగే వున్నారన్నావే. ఏ నామకరణంనాడో ఏ ఉపనయనం నాడో ఒకరి పేరెట్టి మరొకడిని పిలిస్తే మంత్రాల ఫలితమూ, అదీ, ఇదీ, అన్నీ తారుమారయిపోవ్వటూ? అలా పేర్లు మారకుండావుండడానికి ఏం చెయ్యాలిరా?" అని అడుగుతోంది. అవును, మహా గట్టి చిక్కే వచ్చిపడింది ఏం చేయడానికీ నాకూ తోచడంలేదు

నీకేం తెలుసుగాని 'చార్ మినార్'లో వున్న 'ఫ్లేవర్' 'స్టేట్ ఎక్స్‌ప్రెస్'లో వుండదు అబ్బీ! నేను వాటిని వొదిలి పోవడం లేదులే

మొన్న నీ క్షేమం కార్డు వచ్చి వెళ్ళింది.

లోకనాథం.

## 4

బందరు,
25-1-55

......మీ అమ్మకు అలాంటి సందేహం కావడం న్యాయమే మరి. ఆ చిక్కు ఎలా విడదీయడమో నాకూ అర్థం కాలేదు.

ఈవిషయం మా అమ్మమ్మతో చెప్పాను. "నీచేమో పసిదానివాయెను. నీవు అబ్బాయిలని పేర్లెట్టి పిలవడంలో పొరబడతావేమోనని మీ అత్తయ్య అనుకోదూ మరి? అందుకు నేనో ఉపాయం చెబుతా విను. ఎంతయినా ఆమె పెద్దదీ; నీవామెకు లొంగి వుండాల్సినదానివి. అంచేత పుత్రాల్లిద్దర్నీ తీసుకుని అత్తగారింటో అడుగు పెట్టగానే 'వీడు ప్రభాకరం వీడు దివాకరం' అని ఆమెకు చూపించు. వెంటనే ఆమె పేర్లని మార్చేస్తుంది. అంతేగా! పోనీ ఆ తర్వాత కూడా పొరబాటు కవకాశం వుందని ఆమె అనుకునేటట్టయితే, దంటిపిల్ల లిద్దరికీ వేర్వేరు రకాల సొమ్ములు చేయించిపెడితే సరిపోతుంది. పెద్దవాడికో రెండు సవరన్ల మామిడి పిందెల హారమూ, చేతులకి రెండు జతల పట్టగాజులూ చేయించి, రెండో వాడికి ఏ రెండో మూడో సవరన్ల స్వస్తిక్ చెయినూ, బొంబాయి ఫేషను గాజులజతా వేయిస్తే సరి—తకీమని వీడు వీడే నని చెప్పొచ్చు. ఆతర్వాత అల్లుడుకూడా పొరబడ్డానికి అవకాశం వుండదనుకో. అయినా బంగారంధరలు మండిపోతున్న ఈ కాలంలో ఇన్ని చేయించడానికి ఏ నాలుగు వందలో కావలసివస్తుంది. మీ అత్తగారి మెళ్లో ఆరు సవరన్ల చెయినుందిగా! ఇంకా ఆమె కదెందుకూ? చక్కగా దాన్ని కరిగించి పుత్రాళ్లకి వేర్వేరుగా సొమ్ములు చేయించి పెడితే మనవళ్లిద్దర్నీ వేయికళ్లతో చూస్తూ కాలం గడపవచ్చు ఆవిడ."

ఆవిడ ఇంకో వుపాయం చెప్పింది. "ఎన్ని సొమ్ములు చేయించినా పుత్రాళ్లకి నీవు పెట్టిన పేర్లని మీ అత్తయ్య మార్చితే నాకు మనసులో కాస్త ఇదిగానే వుంటుంది. అంచేత మరోమాట చెబుతా విను. నీవు మీ అత్తగారితో అబ్బాయిల పేర్లు చెప్పేటప్పుడు ప్రభాకరం పేరు దివాకరమనీ, దివాకరం పేరు ప్రభాకరమనీ చెప్పు. వెంటనే ఆమె పేర్లని మార్చిపెడుతుంది. అందువల్లాన్ని, పుత్రాళ్ళకి నీవు పెట్టిన పేర్లే వుంటాయి; మీ అత్తగారికీ తనే అబ్బాయిలకి పేరుపెట్టానన్న తృప్తి వుంటుంది. అయితే ఇది పరమరహస్యంగా గుండెలో దాచుకోవాలి, తెలుసా? మీ ఇంటాయనక్కూడా తెలియనివ్వకు" అంది.

అయినా మీతో చెప్పకుండా వుండలేను గనుక మీకు రాసేస్తున్నాను. మా అమ్మమ్మ ఉపాయం ఎలావుంది?

శ్యామల ఊరినుండి వచ్చిందా? వాళ్లమ్మ వాళ్లు సంక్రాంతికి ఏం చీర కొనిచ్చారుటా?

స్టేట్ ఎక్స్‌ప్రెస్ తాగుతున్నారా? తాగరూ మరి, అడిగేవాళ్లు లేకపోతే. వస్తున్నా. వస్తున్నా

కల్యాణి.

పి. యస్.: పుత్రవేధవ లిద్దరూ బోర్లపడి తోగాడుతున్నారు. పెద్దవాడు మొన్న ముక్కు నేలకికొట్టుకుని ఒక్కటే ఏడుపు. అవధాన్లుగారిని త్వరలో మంచిరోజు చూడమన్నాను.

## 5

జార్జిటౌన్,
2-2-55.

...బాగున్నాయి మీ అమ్మమ్మ ఉపాయాలు. ఆమెని గనక ఆర్థిక శాఖామంత్రిణిగా చేస్తే అమెరికాకు కూడా లోటు బడ్జెటు చూపగలదల్లేవుంది. అయినా ఆమె బుర్రలోకి మన జార్జిటవునులో సందుల్లాటి ఆలోచన లెలావస్తాయో? బహుశా ఆరణాల నవల్సు అనేకం చదివిందేమో? కొంపతీసి తనూ ఒకటి రెండు రాసిందేమో?

మీ ఉపాయాలటుంచి - ప్రభాకరం దివాకరం ప్రభృతుల దహాలని స్వర్ణాభరణాలతో దేదీప్యమానంగా ప్రకాశింప చేయాలన్న మీ అమ్మమ్మ మహదాశయాన్ని గురించి మా అమ్మతో ప్రస్తావించాను. "బాగుంది! వయసొచ్చిన అమ్మాయిలే బోసి మెడతో, ఉత్త వాచీచేత్తో వీధిలో వెడు

చూన్న ఈ కాలంలో మగపెళ్ళివారియిలకి రగలేచిగ్రా? ఎవరయినా వింటే నోటితో నవ్వరు, తెలుసా? మన కల్యాణి తెలివిగలపిల్ల ఎలాగో పేరు సరిగానే గుర్తు పెట్టుకుంటుందిలే. అందుకోసమని నా చేయిస్తే చేరిపించడమూ-ఏం అక్కర్లేదు" అంది మాఅమ్మ. సొమ్ము లొస్తాయని 'కులికిపోతు న్నావు గాబోలు అత్తపెట్టిన నాలుగూ పెట్టడం అయిందా? ఇహ ఊరుకో

మరోవిషయం నీవు మీ అమ్మగారింటి కెళ్లిన ఈ ఐదారుమాసాలనుంచీ చూస్తున్నా నీవు పూర్తిగా వ్యక్తిస్వాతంత్ర్యం కోల్పో తున్నటున్నావ్. నీ భావప్రకటన శక్తి తప్పగుత్తోంది నేను నీకేదిరాసినా నిన్నేమి అడిగినా నీవు అందుకు సమా

---

దినదినమునకు ఇంకా మృదువైనటు వంటియు, ఇంకా మనోహరమైనటు వంటియునైన చర్మము...

...* కేడిల్‌తోకూడిన రెక్సోనా గుప్తమైయున్న మీ సౌందర్యమును బయల్పర్చును.

రెక్సోనాయొక్క కేడిల్‌గల నురగను మీ చర్మములోకి మెల్లగా రుద్ది, తర్వాత కడిగివేయండి. దిన దినమునకు మీ చర్మము ఇంకా మృదువుగాను, ఇంకా మెత్తగాను అగును — మరియు మీరు క్రొత్త ఆకర్షతను కలిగియుంటారు.

పెద్దసైజులోకూడా దొరకును

Rexona

రెక్సోనా

ఇది ఒక్కటే కేడిల్‌తోకూడిన సబ్బు

* చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగాచేయునటువంటియునైన నూనెల ఒక మిశ్రమమునకు రిజిష్టర్డు పేరు.

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్‌వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది

W.R. 130-X52 TL

# ★ అమ్మా - అమ్మమ్మా ★

ధానంగా 'మా అమ్మమ్మ ఇలా అంటోంది, అలా అంటోంది' అని రాస్తున్నావెందుకూ? మీ అమ్మమ్మ ఏం, పత్రికావిలేఖరా? నీకు జవాబులంటూ తోచవూ? అదీగాక ఇక్కడికొచ్చినతర్వాత సర్వవ్యవహారాలూ ఒంటరిగా నీచేతిమీదే నడపాలిగా. పాపము శమించుగాక! నీతోపాటు మీ అమ్మమ్మ కూడా రైలెక్కదుకదా!

ఏమిటే, అవధాన్లుగారు మంచిరోజు చూచి చెప్పారా లేక మీ అమ్మమ్మని అడుగుతో కూచున్నారా? శ్యామలకు ఏంచీర పెట్టాలన్న సమస్యను భేదించడం నీకే చేతనవును.

మా ఊళ్ళో 'జ్యోతి' లో ఆడుతున్న 'ప్రణయసీమ' చాలా బాగున్నదట.

లోకనాథం.

## 6

బందరు,
6-2-55.

.. మీరు చెప్పింది నిజమే. ఇంటర్ వెలిగించి, ఇద్దరు పిలల తల్లినయిన నాకు ఉత్తరం రాయడం తెలిసి వుండవల్సిందే కానీ నా కలాంటి అలవాటు పెంపొందించనందుకు మా అమ్మతో మొన్న పోట్లాడాను. వెంటనే ఆమెతరఫున మా అమ్మమ్మ లేచింది తారాజువ్వలా. "అలా చెప్పినంతమాత్రాన వచ్చేవిద్యయితే నీవు జార్జిటౌన్‌లో సంవత్సరన్నరకాలం కాపురం వెలిగించావుగా, అపుడు నేర్పునని వుండకూడదూ! నీ మొగుడు ఎమ్మేకదా, నీకు ఉత్తరాలు రాయడం నేర్పించకూడదూ! మీ అత్తగారు చాల లోకానుభవం వున్నమనిషి. ఏవిషయమయినా ఒకటికి నాలుగుసార్లు ఆలోచించి నీభర్తతో చెబితే అతను కూడా తప్పకుండా రాస్తాడు. అంత తెలివి నీ కెక్కడేడిసింది?" అని నన్ను చీవాట్లు పెట్టింది మా అమ్మమ్మ. నన్నేం చెయ్యమంటారుప్రభూ?

ఇంకో పది రోజుల తర్వాతగాని మంచి ముహూర్తాలు లేవని అవధానులుగారు చెప్పారు శ్యామల చీరవిషయం కనుక్కోలేని మనిషి 'ప్రణయసీమ' బాగున్నదని సిఫార్సుచేయడ మెందుకూ? ఆ సినిమా చూచానని చెప్పరాదూ?

కల్యాణి.

## 7

జార్జిటౌన్
8-2-55

..... అనగా అనగా ఓ అబ్బాయి ఆ అబ్బాయి బెండకాయకన్న కాస్త ఎక్కువగా ముదిరినా పెళ్ళంటూ చేసుకోలేదుట. ఓ రోజు ఓ అమ్మాయొచ్చి 'అబ్బాయీ! అబ్బాయీ! పెళ్ళి చేసుకోకూడదా?' అందిట. అందుకా అబ్బాయి 'అమ్మాయీ! అమ్మాయీ! నీవే నన్ను పెళ్లాడకూడదా?' అన్నాట్ట. అలావుంది నీకథ. నీకు తోచింది నీ వెందుకు రాయకూడదూ అని అడిగితే అందుకు కూడా మీ అమ్మమ్మే జవాబు చెప్పాలి! గ్రహబలం వక్రించడం అన్నది దీనికే పర్యాయపదం గాబోలు.

మీ అమ్మమ్మ బుర్ర సామాన్యమయిందా! రాజాజీని తలదన్నినతల ఆమెది. ఉపాయాల దెబ్బకి గోబెల్సు ఉక్కిరిబిక్కిరయేవాడు. పైన తెలివి కారుతుంటాయి; లోలోపల తెల్లింటాయి—మీ అమ్మమ్మ వాక్కుల్లో. గురువుగారికి సాష్టాంగ నమస్కారంచేస్తూ పాదాలు లాగే రకం మీ అమ్మమ్మ!

పుత్రాళ్లు ఎవరి పోలికోనని అడిగితే 'ఏడుస్తున్నపుడు అచ్చం మీఅమ్మ పోలికే' అనడం! కవలపిల్లలుగదా, గుర్తు తెలియక పేర్లు తారుమారవుతాయేమోనంటే వెంటనే అరు నవరత్నాల చెయిన్‌కి ఎసరుపెట్టడం! మీ అమ్మమ్మ నడుక్కుండా నీవే జవాబు రాయి అంటే 'మీరు నాకు నేర్పించారు గనక నా?' అని అడగమనడం! పైగా 'మా అమ్మ చెప్పింది విని మీరు రాస్తున్నారు గా?' అని ఎదురుప్రశ్న వేయడం!

భేష్! బాగుంది! మహా బాగుంది. అయినా ఇంత కల్లోలానికి కారణమయిన మీ ఈఅమ్మమ్మ ఎవరూ? ఒక్క రోజులో ముగిసిన మన పెళ్ళిలో అపూర్వమైన ఈ ఘటాన్ని చూచిన జ్ఞాపకం లేదు మన సంవత్సరంన్నర మదరాసు కాపురం సమయంలోనూ ఈవిడ గారు వేంచేసినట్లు లేదు. అంచేత ఈమెను చూపెడం తటస్థపడలేదు. అసలా మాటకొస్తే, నీ ఇటీవలి ఉత్తరాలు చూచిన తర్వాత ఆ మహా మహిళను చూడాలనిపించడం లేగు కూడాను. ఆ— అంటే ఈమె కంటికి అరు నవరత్నాల చెయిన్ కన్పడుతున్నదే - ఈవిడ భర్తగా రేవ



యినా 'గజెటెడ్ రాంక్'లో వుండేవా కేవిటీ? 'గజెటెడ్ రాంక్' కాగు 'ఫారెన్ సర్వీసు'లో వున్నా ఆయున ఈమె మాటకు మగుమాట చెప్పేవాడు కాదని నాకు ఏదో శక్తి చెబుతున్నది. అట్లా వుండడమే ఆడపిల్లకి అందం అనబోయేవు సుమా నీవు- మీ అమ్మమ్మ నడకుండానే!

మన అబ్బాయిలు ఎవరిలా జోగాడు తున్నారంటూంది మీ అమ్మమ్మ? వ్రాళ్ల తెలివి తేటలని గురించి ఆమె అంచనా ఏవిటి? ఆ వధువ లిద్దరూ చదవాల్సిన కోర్సులను గురించి సదరు అమ్మమ్మ అభిప్రాయం ఎటువంటిది?

అక్కడికి రావడానికి నాకు సెలవిప్పించమని మా ఆఫీసరుగారితో మీ అమ్మమ్మ కాస్త 'రికమెండ్' చేస్తుందేమో కనుక్కో.

లోకనాథం.

## 8

బందరు,
16 2-55

...మా అమ్మమ్మ అంటే మీకింత వేళాకోళమా? ఆమె ఎంతో మంచిది. చాల సాధువు. అతి తెలివిగల వ్యక్తి. అసలు పక్కవారి గుణాలు తూచడం మొగాళ్లకేం తెలుసూ? అందులోనూ మీకు బొత్తిగా అది శూన్యం. అదిగాక మీ రింతవరకూ ఆమె నొక్కసారికూడా చూడలేదాయెను అంచేత నేను మద్రాసొస్తున్నప్పుడు ఆమెను కూడా తీసుకొస్తున్నా. ఆమెను చూచారంటే మీరు నామాట కాదనరు.

మా అమ్మమ్మ లోగడ మూడుసార్లు కాశీ వెళ్లొచ్చింది. అంచేత రామేశ్వరం చూడాలని వున్నదట మద్రాసుకొచ్చి మనతో నాలుగు మాసాలుండి రామేశ్వరం వెడుతుంది. మా అమ్మమ్మకి కూడా గోవింద నామాలూ, మేలుకొలుపులూ అంటే పరమ ఇష్టం. అంచేత ఈమెవుంటే మీ అమ్మకి కాలక్షేపంకూడా అవుతుంది.

ఆమె వుంటే నాకు చేదోడు వాదోడుగా వుంటుంది - పిల్లల్ని, చూచుకోవడానికి . మీ అమ్మకి జవాబు లివ్వడానికీ

కల్యాణి.

## 9

(ఎక్స్‌ప్రెస్ డెలివరీ)

జార్జిటౌన్,
17-2-55.

.. శరణు శరణు ఏదో వేళాకోళం చేశాను. ఏవి టేవిటో రాశాను. కానీ మీ అమ్మమ్మ రాక వంటి నారాయణాస్త్రానికి తట్టుకోగల ధీమా లేదు కల్యాణీ, లేగు.

మీ అమ్మమ్మను చూడకుండానే నీ వామెనుగురించి చెప్పిందంతా ఒప్పేసుకుంటాను. ఆమె మహామేధావి సుగుణాల పుంజం. ఆమెలాటి మనిషి లేదు - ఉండబోదుకూడా.

ఆమె రామేశ్వరం చూడాలంటున్నదా? అబ్బే! రామేశ్వరయాత్రకిది 'సీజన్' కాదుగా. కావాలంటే బదరీనాథ్ వెళ్ళి రమ్మను. మంచుకిరీటాలు ధరించిన మహోన్నత శృంగరాజాల ప్రశాంత వాతావరణం ఆమెకు నచ్చిపోయి, అంత్యకాలం ఆ భగవత్ సాన్నిధ్యంలోనే గడిపేయవచ్చునన్న సంకల్పం ఆమెకు కలగవచ్చుకూడా.

అదటుంచి నేనుచేసిన చిన్న అపరాధం విన్నవించుకుంటున్నాను దేవీ! సావధాన చిత్తవై అవధరింపుము. మా అమ్మ అంది, మాఅమ్మ అంటున్నది - అంటూ నేను రాసినదంతా పచ్చి అబద్ధం! పాపం ఆమె ఏదో కృష్ణా రామా అనుకుంటూవుంది, మరొకరి జోలికి రాకుండా.

నీ వేం జవాబు రాస్తావోనన్న కుతూహలం కొద్దీ తమాషాగా ఏదేదో కల్పించి రాశాను. అంతేగాని మరోటికాదు. మనవళ్లు పుట్టారని మురిసి ముడింతలయి ఎప్పుడెప్పుడు వాళ్ళని చూడామా అని తహతహ లాడిపోతూంది మాఅమ్మ. అంతే కాని, ఇంకో విషయమై పెదవికదిపినపాపాన పోలేదామె నేనూ అంతే! మీ ముగ్గుర్నీ చూచేరోజు కోసం అహర్నిశాలూ ఎదురుచూస్తున్నాను. అంచేత మీఅమ్మమ్మ నటు బదరీనాథ్‌కు బయలు దేరనిచ్చి, నీవూ చిరంజీవులూ ఇటు బయలు దేరండి

ముసల్లందరినీ సర్దిపెట్టడం నీ ఒక్కతెకు చేతకానిపని కాదుగా! అంచేత పాపం ముసలావిడను శ్రమ పెట్టకు.

ఈఉత్తరం నిన్ను అందుకునేలోగా నీవు మెయిలునందుకుని వుండవన్న చిన్న ఆశతో వున్నా నీ

లోకనాథం.

## 10

బందరు,
19-2-55.

..... హా.. మీ ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరం తలచుకుంటే ఇంకా నవ్వాగటం లేగు! ఇంకా నయం, టెలిగ్రాం ఇచ్చారు కారు ..

ఎంతో మంచిదయిన మా అత్తయ్యనంత చెడ్డదానిగా చిత్రించగల కల్పనాశక్తి మీకే వుందనుకున్నారు గామోసు మన కలాల్లో ఏదో కాస్త పెమరు వేసుకోండి' అమ్మ, మా అమ్మ అంటూ మీరు ఉత్తరాలు రాసినప్పుడేల్లా, అందుకు కించిత్తయినా తీసిపోకుండా 'మా అమ్మమ్మ'ను సృష్టించుకుని మీకు జవాబులు రాశాను నేను అంతేగాని నాకు ఈ భూమ్మీద అమ్మమ్మ అంటూ ఎవ్వరూ లేదు!

ఎల్లుండి బుధవారం మెయిలుకు మా తమ్ముణ్ణి తీసుకువస్తున్నా. తప్పక స్టేషనుకు రండి.

కల్యాణి. ★

# ★ మనసా!... ★

(19-వ పేజీ తరువాయి)

ఉంటావని ఒక్కళ్ళుకూడా అడగలా. ఒక చిన్న సంచీ తీసుకుని అమ్మాయి ఇల్లు వదిలి పెట్టింది. ఏం చేయబోతోందో ఆమెకే అర్థంకాలేదు. సరాసరి మహారాష్ట్ర మండలీకి వచ్చింది. అక్కడికి వచ్చిందన్న మాటే గానీ - అక్కడ ఉండటానికీ, అన్నపానాదులకీ డబ్బు చెల్లించటమనేది ఆమెకు సాధ్యమైన పనిగాదు. నాకు ఉత్తరం వ్రాసింది నేనూ సమయానికి వచ్చాను. ఒకవేళ అమ్మాయి వ్రాసిన ఉత్తరం నాకు అందకపోతే, నేను రాకపోయినట్లైతే, అమ్మాయి సంగతి ఏమైయ్యేది? నన్ను చూచేప్పటికి ఆమె మనస్సు కొంచెం కుదుటపడింది.

భగవంతుని దయవల్ల నాదగ్గరగూడ యిద్దరి టిక్కెట్లకు కావలసిన డబ్బుఉన్నది. అది లేకపోతే ఎవరిదగ్గరైనా చెయ్యి చాచవలసి వచ్చేది లేకపోతే ఉన్నసంగతి ఉన్నట్లు చెప్పివేయవలసి వచ్చేది కనీసం కలకత్తాలోనైనా ఎవ్వరికీ తన సంగతి తెలీకుండా ఉండాలని ఆమె అనుకుంటోంది అక్కడి మహారాష్ట్రులతో అమ్మాయికి స్వల్పంగా పరిచయం ఉన్నది. వాళ్ల ఉత్సవ సమారోహాల్లో పాల్గొంటూండేది. ఉత్సవాలకి చేతికొద్దీ డబ్బు యిస్తూండేది. ఇల్లు విడిచిపెట్టడం, తర్వాత వాళ్ళల్లో ఎవరినైనా డబ్బు అడగటం ఆమె కెంత మాత్రం యిష్టంలేదు అదృష్టవశాత్తు ఆ ప్రసక్తే తప్పిపోయింది.

ఆ రోజు సాయంకాలం అమ్మాయితో కూడ నేను బయల్దేరాను. రాత్రి, రైల్లో అమ్మాయి ఆ నిద్రలో మునిగిపోవటం చూస్తే నాకు చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది. నే వెళ్ళేవరకు అమ్మాయి మనస్సు మనస్సులోలేదు. నే వెళ్ళాక కాస్త ధైర్యం తెచ్చుకుంది. కలకత్తా విడిచిపెట్టాక బహుశా ఆమె మనస్సులోని బరువు తేలికపడి గాఢనిద్రలో మునిగిపోయిందేమో నని పించింది.

ఉదయం చక్రధరపూర్ స్టేషన్ రాగానే మా పెట్టెలో ఉన్న ప్రయాణీకులంతా దిగిపోయారు. మేమిద్దరం మాత్రం మిగిలాము. మనం యిప్పుడు కాస్త మనస్సు విప్పి మాట్లాడుకోవచ్చు నంటూనే ఉన్నది ఇంతలో ఒక ప్రౌఢ యువతి పెట్టెలో జొరబడి ఎదర బెంచీమీద వచ్చికూర్చుంది. మనస్సు విప్పి మాట్లాడుకోవచ్చు ననుకొన్న అమ్మాయి అభిలాష నెఱవేరిందికాదు.

బండి బయల్దేరినతరువాత ఆస్త్రీ మావంకే చూడటం మొదలెట్టింది. మనూని కూడ గానే ఒక్కసారి ఉలిక్కిపడి అప కుండా చూస్తూనే ఉన్నది. మహారాష్ట్రుల ఆమె అయితే వితంతువు. మనూమీనే ఆమె దృష్టి లగ్నమాటం చూస్తే నాకాశ్చర్యం వేసింది. ఒక్క క్షణం కూడ చూపు మరలించటంలా. కళ్లనిండా నీళ్లు పొర్లివచ్చేట్లున్నాయి. హృదయంలోనించి ఉప్పొంగివచ్చే ఉద్వేగాన్ని ఆపుకోడానికి ఆమె శక్తివంచన లేకుండా శ్రమ పడుతోంది. కాని ఆఖరికి పట్టలేకపోయింది. లేచివచ్చి మనూదగ్గర కూర్చుంది దుఃఖాన్ని దిగమ్రింగుతూ - నీ పేరేమిటమ్మా? ఎవరమ్మాయివి నీవు? అన్నది. ఆమె ప్రశ్నలకి మనూ నివ్వెరపోవటం చూచి, నేను తమరెవరండీ? అన్నా నామెను. ఆమె నాకు సరిగ్గా సమాధానం ఇవ్వనేలేదు. మనూ చెంపమీద ఉన్న పుట్టుమచ్చవైపు దీర్ఘంగా చూస్తూ—ఇది మామూలు మచ్చగా లేదే? పుట్టుమచ్చా ఏమిటి? అన్నది. నేను ఔనననేప్పటికి ఆమె కళ్ళవెంట జలజల నీళ్లు రాలాయి ముఖం త్రిప్పి పమిట చెంగుతో కళ్లు తుడుచుకుని, ఒక్కసారి బాత్ రూమ్ లోకి వస్తావా అమ్మ అన్నది.

ఆమె అడగటానికి మనూ మరింత గాభరా పడింది. నేను ఆమెతో - చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారే! మీ ఇద్దరికి మునుపటి పరిచయం ఏమాత్రం లేదు. ఆ అమ్మాయికి మీరెవరో తెలీదు బాత్ రూమ్‌లోకి రమ్మంటారెందుకు? ఆమె వొంటిమీద నలుసంత బంగారమైనా లేదాయె. అన్నాను.

ఆమె నా మాట పూర్తికాక మునుపే క్షమించండి. పొరపాటైంది అల్లాంటి మచ్చే—అమ్మాయి వొంటిమీద యింకా ఎక్కడైనా ఉన్నదా లేదా తెల్సుకోవాలని, అల్లాంటి మచ్చే. .. మా...... ... అంటూ ఆవురుమన్నది.

మనూకిగూడ మనస్సులో తెలీకుండా గందరగోళంగా ఏమైనా ఉందో ఏమో తనుగూడ ఏడవటం మొదలెట్టింది. బాత్ రూమ్‌దాకా వెళ్ళవలసిన అగత్యమేమీ లేదు. నా వీపుక్రింద ఎడమవైపున అల్లాంటిదే రూపాయంత పుట్టుమచ్చ ఉన్నదని మనూ చెప్పేసింది.

మనూ మాట వినటంతోనే ఆమె మరింతదై తృషిత నేత్రాలతో—బొంబాయిలో గురుదేవుని అనాధాశ్రమంలో ఎప్పుడైనా ఉన్నావా నువ్వు? అన్నది గాద్గదికంగా. మనూ నోటివెంట మాట పెగలకపోవటం చూచి నేను - అవునండీ ఈమె అనాధాశ్రమంలో ఉండేది అన్నాను. నా మాట పూర్తిగా వినకుండానే ఆమె మనూని కౌగిలించుకుని అయ్యో నా తల్లీ అని అవుతు న్నది. ఏమిటో లోలోపల గొణుక్కున్నది.

మనూకి అమ్మదొరికింది వాళ్లిద్దరి ముఖాల్లో కొంచెంపోలికలున్నట్లు నేను మొదట్లోనే కనిపెట్టాను ఇప్పుడింక సందేహానికి తావు లేదు. మనూ కొంతసేపటివరకూ నిశ్చేష్టురాలుగా ఉండిపోయింది గాయపడ్డట్లు ప్రాణాలన్నీ బిగపట్టి మనూ ఆమెవైపు చూస్తూ తెలీనిబాధ పడింది. అమ్మా అంటూ మెడ పెనవేసుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. ఆఘట్టం చాలహృదయవిదారకం గాఉన్నది. నేనేమిటో స్తబ్ధుడనై నిల్చుండిపోయాను.

కన్నతల్లి కరస్పర్శచేత ఆపిల్ల చల్లగా నిద్రపోయింది ఆ అదృష్టాన్ని ఏమనాలి? ఆమె అదృష్టవంతురాలా? గురదృష్టవంతురాలా? అనాధాశ్రమంలో పెరిగింది. అష్టైశ్వర్యాలతో పెద్దదైంది. కలీనుల కోడలైంది. తల్లి దండ్రీ పోయినా దనుకుంటుండగా - అటు అత్తవారిల్లుకూడా జారిపోయింది. నాథుడు బ్రతికిఉండగానే అనాధ అయింది మిన్ను విరిగి మీదపడిందనుకుంటుండగా - పుట్టుకతోనే పోగొట్టుకున్న తల్లి కంటపడింది మహాకవుల కల్పనలకు అందని సుఖదుఃఖాల విచిత్రమైన సమ్మిశ్రణ. ఆమె తల్లియొక్క ఎనుకటిగాథ నాకు తరవాత తెలిసింది. కాని ఆమె ఎవ్వరితో చెప్పవద్దని ఒట్టుపెట్టింది. ఏదిఏమైతే కావాలో అది దొరికింది మనూకి అమ్మ దొరికింది. గడిచిన కథతో ఏంపని?

వాళ్లిద్దరూ నాగపూర్‌లో దిగారు వెళ్లేటప్పుడు తల్లీ కూతురూ నాకాళ్లకు దణ్ణం పెట్టారు మామయ్యే నాకు అమ్మని యిచ్చాడు. మొదటనుంచీగూడ . .. . అంటూండగానే అమ్మాయినాపి, ఆ సంగతి అలా ఉంచు ఇది నీకు నాలుగో యిల్లు కాదు. మొదటియిల్లు ఒకసారి వెళ్ళిచూడు. తర్వాత నాకుత్రాయి వీలునిబట్టి ఒకసారి వచ్చి చూస్తానన్నాను

మనూ ఏడుస్తూ - నన్ను మర్చిపోకేం మామయ్యా అన్నది నాకుగూడ విచారం వేసింది. గొంతు పెగలలా నోట్లోంచి మాట రాలా. బండి బయల్దేరింది. ఇంకా వాళ్లిద్దరు కళ్లు తుడుచుకుంటూ చెయ్యి ఊపుతూనే ఉన్నారు

అల్లాంటి విచిత్రమైన అదృష్టవంతురాలిని వాళ్ల మామయ్యమాత్రం ఎట్లా మర్చిపోగలడు? ★

# వనితాలోకం

## స్త్రీజనోద్ధారకుడు



"నా భార్యను విద్యావతిని గా చేయక నేను స్త్రీ విద్యకై పాటుపడటములో అర్థములేదు" అని తాను ఇంటిని చక్కబెట్టుకుంటూ భార్యను పాఠశాలకు పంపాడు - సుమారు డెబ్బది సంవత్సరాల క్రిందట ఒక స్త్రీ విద్యాభిమాని స్త్రీ జనోద్ధరణకై డెబ్బది సంవత్సరకాలము ఆయన చేసిన కృషికి భారత ప్రభుత్వము అభినందించి, 'పద్మ విభూషణ' బిరుదుతో సమ్మానించింది. ఆ సత్కారమును పొందినది 97 సంవత్సరాల పండు ముదుసలి శ్రీ ధోండో కేశవ కార్వేపండితుడు.

బొంబాయి రాష్ట్రములో, రత్నగిరి జిల్లాలోని ఒక చిన్న గ్రామములో అతి సామాన్య కుటుంబమున జన్మించిన ధోండో కేశవకార్వే 'ఈ దేశమున అక్షరజ్ఞానము లేని స్త్రీ ఉండకూడదు'ని ప్రతిజ్ఞ చేస్తాడని ఎవరనుకొన్నారు? ఆ ప్రతిజ్ఞను అక్షరాలా నెరవేర్చగలుగుతాడని ఎవరు కలగన్నారు?

తండ్రికి సాలీనా పాతిక రూపాయల సంపాదన; సంసారము గడవటమే కష్టము; పైగా వారి పూర్వులు పీష్వారాజులకు గురువులు - కుటుంబ గౌరవము కాపాడుకోవాలి.

కార్వేపండితుడు తన-28 వ ఏట ఆంగ్ల భాషాభ్యాసము ప్రారంభించాడు-28 వ ఏట పట్టభద్రుడయినాడు. పట్టభద్రుడు కాకపూర్వము-చిన్న ఉద్యోగముకొరకు పబ్లిక్ సర్వీసు కమీషనుపరీక్షకనిపోగా, అధికారులాయనను అల్పవయస్కుడని తిరస్కరించారు సన్నగా పొట్టిగా అర్భకునివలె కనబడుతున్న కార్వే, తాను నియమిత వయః పరిమితిలోనే ఉన్నాడని చెప్పినా, వారు విశ్వసించలేదు. కాని అదికూడా ఒకందుకు మంచిదిగానే పరిణమించింది మహాత్ముల జీవితాలలో సంఘటిల్లిన ఆశాభంగాలు మహోత్కృష్టమగు కార్యదీక్షకు ప్రోద్బలం యిస్తాయి కార్వేపండితుని జీవితానుభవము కూడా ఇటువంటిదే

ఎనభై సంవత్సరాల క్రిందట స్త్రీవిద్యావశ్యకతనుగురించి నోటితో అనుకోవటమే మహాపాపముగా పరిగణింపబడేది ఏ విషయముగాని మత సంప్రదాయానుసారము నడుముకోవటముతప్ప, సంస్కారమనుమాట తలపెట్టకూడదు - అందులో స్త్రీల విషయములో అసలే కూడదు. అటువంటి పరిస్థితులలో కార్వే పండితుడికి పరీక్షాసమయము వచ్చింది — ఆకస్మాత్తుగా పత్నీవియోగము తటస్థించింది ఆయనకు 14 సంవత్సరాల వయస్సున్న ఎనిమిదేళ్ల పిల్లనిచ్చి వివాహము చేశారు. పదేళ్లతరువాత ఒక కుమారుని కని ఆమె అకాలమృత్యువు వాతబడ్డది.

అప్పటికి ఆయనకు సరిగా 24 సంవత్సరాలవయసు బంధువులందరు పునర్వివాహము చేసుకొమ్మని బలవంతము చేశారు. 'తిరిగి వివాహమాడదలచుకొంటే వితంతువునుతప్ప చేసుకోన'ని పట్టుబట్టాడు 'తాను విధురుడు - తన కీడైనది వితంతువు కాని కన్యకాదు' ఇదే ఆయన వాదము.

ఆ కాలములో వితంతువులది అగచాట్లమారి జీవితము. పుట్టింటగాని అత్తింటగాని ఒంటిపూట భోజనముతో ఇంటెడుచాకిరి చేయవలసి వచ్చేది. ఒకకంట నీరుకారుస్తూ, వారిచ్చిన భరణముతో బ్రతికేవారు. ఎంతఉన్నత కుటుంబములో పుట్టినా బండబ్రతుకుగా ఉండేది. దీనికి వ్యతిరేకముగా ఎవరు ఏ చిన్నపని తలపెట్టినా సంఘ బహిష్కరణకూ, దూషణకూ గురి కావలసినదే. కార్వే వితంతు వివాహము తలపెట్టగానే బంధువులందరూ విస్తుపోయారు; నలుగురూ నడచినబాటనే ఆయననుకూడా నడవమన్నారు; క్రొత్తదారి త్రొక్కవద్దన్నారు, బెదరించారు, బ్రతిమలాడారు. కాని ఆయన తన నిశ్చయాన్ని మార్చుకొనలేదు.

సరిగా ఈ సమయములోనే పూనాలోని

(30-వ పేజీ చూడండి)



“చా కి రే వు” (విజయవాడ కృష్ణా బ్రిడ్జి దగ్గరనుంచి ఆనకట్టవైపు)



—ఫొటో : వై. రామకృష్ణారావు, బందరు.

ఫర్గుసన్ కాలేజిలో అధ్యాపకపదవి ఖాళీ అయింది.

గోపాలకృష్ణ గోఖలేగారు కార్వేపండితుని పిలువనంపారు. పండితుడు ఉద్యోగములో చేరటానికి పయనమయ్యాడు. 'ఉద్యోగపు సందడిలో మనసు మారకపోతుందా' అని బంధువర్గము తలపోసింది.

అప్పటికే పూనాలో పండిత రమాబాయి, శారదా సదనమను పేరిట ఒక శరణాలయము స్థాపించి నడుపుతూ ఉండేది. అనాథస్త్రీలు వితంతువులు దానిలో చేరుతూ ఉండేవారు. గోదుబాయి బాలవితంతువు. సోదరుడామెను శరణాలయములో చేర్పించాడు. ఆ బాలవితంతు అని చెప్పి ఆమెను తిరిగి వివాహము చేయ తలపెట్టాడు. అందుకామె సమ్మతించలేదు.

"వితంతువును వివాహము చేసుకొంటానని ధైర్యోత్సాహాలముతో వచ్చిన విశాల హృదయునే చేసుకొంటాను - కాని వెదకి వివాహమాడను"ని గోదుబాయి పట్టు పట్టింది.

కల్మషమెరుగని గోదుబాయి కార్వే లిద్దరూ ఒకచోట తారసిల్లటము జరిగింది ప్రథమ పరిచయములోనే వారిద్దరూ జీవితాశయాలను పరస్పరము ఎరుకపరచుకొన్నారు. పదిమంది ఎదుట సంబంధము నిశ్చయమైనది. 1893లో మార్చి 11వ తేదీన మూడుముళ్లూ పడ్డాయి. ఆయన హృదయము ఆనందముతో ఉప్పొంగింది- వివాహానంతరము జీవితమాధుర్యమును చవిచూడబోతున్నందుకు కాదు- ఒక వితంతువును వివాహమాడి ఉద్ధరించగలిగినందుకు పెండ్లి విషయము గవంతైనా బంధువర్గానికి తెలియదు.

ఆయన మనసులోని సంఘసంస్కరణాభిలాషను ఆమె గ్రహించింది. సంఘసంస్కరణాభిలాషగలవారు గృహజీవితానికి ప్రాధాన్యతనివ్వరు. ఆయన అభిరుచులలో ఆమె తన మనసును జోరనిచ్చింది; చేతిలో చేయి కలిపింది.

ఆయన తన జీవితములో స్త్రీజనోద్ధరణే ముఖ్యమనుకొన్నాడు. వితంతు పునర్వివాహ సమితినొకదానిని స్థాపించాడు. దేశమంతా తిరిగి ధనము ప్రోగుచేశాడు. పునర్వివాహాలను చేయగల ధైర్యసాహసములు కలవారు, కార్వే పండితునితో పంక్తిభోజనమునకు సమ్మతించినవారు, ఆయన యెడ అభిమానము కలవారు సభ్యులుగా చేశారు ప్రతిసభ్యుడు ఒకరోజు రాబడిని సంవత్సర చందాగా చెల్లించవలెనని కార్వే నియమించాడు. కొంతకాలము తరువాత సభ్యులలో కట్టుడి తగ్గిపోయింది. ద్రవ్యార్జనకు ఆయన మరొకసాధనను వెదకవలసి వచ్చింది.

వితంతువులకు పునర్వివాహము చేయటమే ఆసంస్థ ప్రధానాశయము. కాని కొంతమంది వితంతువులకు బంధువర్గాన్ని ధైర్యముతో ఎదిరించగల సాహసములేకపోయింది. సమితిలో చేర్చగానే వివాహము తప్పదని, తమ వితంతుకుమార్తెలను దానిలో చేర్చటానికి జంకేవారు కొందరు తల్లిదండ్రులు. ఆయనమిత్రులే కొందరు దుష్ప్రచారము చేయటానికి పూనుకొన్నారు. ఈ కారణాలవల్ల సమితి ఆశయాలలో కొంత మార్పు చేయటము కార్వేకు అవసరమనిపించింది 'పరిపూర్ణమైన మనోవికాసమునివ్వగలిగిన విద్యను స్త్రీలకు ప్రసాదించినట్లయితే, వారి సమస్యలను వారే పరిష్కరించుకొనగలుగుతారు. విద్యార్జనవలన స్త్రీలకు స్వయం పోషకత్వము కలుగుతుంది పునర్వివాహము చేసుకొనదలచిన వితంతువు యథేచ్ఛగా వివాహమాడవచ్చును' అని కార్వే నిశ్చయించాడు. ఈ మార్పువలన వితంతూద్వాహసమితి స్త్రీవిద్యా శిక్షణాలయముయింది.

ఆదిలో ఈసంస్థ పూనాపట్టణములో ఒక పూరింట స్థాపింపబడ్డది ప్లేగువ్యాధి పూనా పట్టణమంతా వ్యాపించి ప్రజలను కల్లోల పరచినప్పుడు నాలుగుమైళ్లదూరమునఉన్న హింగ్నికి ఈ సంస్థను మార్చవలసివచ్చినది అదే హింగ్ని మహిళా శిక్షణాలయముగా రూపొందింది శ్రీమతి నాతూబాయి దామోదర్ థాకర్సె మహిళా విశ్వవిద్యాలయముగా వెలసి అనేకమంది స్త్రీలకు విద్యాప్రదానము చేస్తున్నది

ఈ మహిళా విశ్వవిద్యాలయములో ఒక ప్రత్యేక ప్రణాళికను కార్వే పండితుడు ప్రవేశపెట్టాడు ఇతర ఉన్నత పాఠశాలలు కళాశాలలు అనుసరిస్తున్న విద్యా విధానము స్త్రీజనానికంత ఉపయోగకరము కాదని ఆయన నమ్మకము. ఆకారణముచేత స్త్రీ జీవితములో ఏ ఏ అంశాలు ప్రాధాన్యము కలవో వాటికే స్త్రీవిద్యా ప్రణాళికలో కూడా ప్రాధాన్యమునిచ్చాడు. శిశుపోషణ, గృహయాజమాన్యము, పరిశుభ్రత, దుస్తులను తయారుచేయుట, గృహవైద్యము, ప్రథమ చికిత్స మొదలైన అంశాలతో ప్రణాళికను సిద్ధము చేశాడు—'ఈ విద్యాబోధ అంతా మాతృభాషలో జరగాలి. ఆంగ్లభాషను పూర్తిగా విడచిపెట్టకూడదు. ఈ కాలములో ఆంగ్ల భాష నేర్వకపోతే విజ్ఞానప్రదమైన నూతనాంశాలను తెలిసికొనలేము కనుక ఆభాష రెండవ భాషగా ఉండాలి'—ఈవిధముగా అక్షరాలా పాటించి స్త్రీలలో అవిద్యను తొలగించవలెనని కృషి చేశాడు కార్వే పండితుడు.

ఆయన తన లేత వయసులో ఈ మహాకార్యాన్ని సంకల్పించాడు. ఎడతెగని కృషి చేశాడు. స్త్రీవిద్యా వ్యాప్తికొరకు ఆయన హృదయము ఆరాటపడిపోయేది. కనుకనే దేశములోని ఏ మూలయినా సరే—ఏ భాషలోనయినా సరే—తన ప్రణాళికననుసరించి విద్యాబోధ జరిగినట్లయితే తన విశ్వవిద్యాలయములో ఒక భాగముగా పరిగణించేవాడు, రికగ్నిషను ఇప్పించేవాడు.

మాతృభాషలలో విద్యాబోధ చేస్తూ ప్రభుత్వమేర్పరచిన ప్రణాళికను మార్పు చేసినందువల్ల ఆవిశ్వవిద్యాలయానికి ప్రభుత్వ ముద్ర పడలేదు. పట్టభద్రులయినవారికి ప్రభుత్వోద్యోగాలు లభించలేదు. ఈవిద్యాలయములో చదివినవారికి మరే విశ్వవిద్యాలయములోనూ ప్రవేశము కలుగలేదు. కాని దీనికి ఆయన చీమకుట్టినంతైనా బాధపడలేదు. ఆ విశ్వవిద్యాలయములో పట్టభద్రులయినవారిని ఆవిద్యాలయములోనే ఉద్యోగాలలో నియమిస్తూ ఉండేవారు. ఇటీవలనే మూడు నాలుగు సంవత్సరాల క్రిందట మహిళా విశ్వవిద్యాలయానికి ఇతర విశ్వవిద్యాలయాలకువలె సమానాధికారము కొంతవరకు లభించింది. ఆయనచేసిన కృషి కొంతవరకు గుర్తింపబడ్డది వచ్చినంతవరకే లాభమని ఆయనమనసు సంతుష్టి చెందింది.

కార్వేపండితుని స్త్రీ విద్యాపిపాస అంతటితో తీరలేదు ఆయన తన 78వ ఏట మహారాష్ట్ర దేశములోని పల్లెయుల విద్యావ్యాప్తి కొరకు ప్రాథమిక విద్యాసంఘమొకటి నెలకొల్పాడు దానికి తన 70 రూపాయల పింఛనులోనుండి 15/ రూపాయలవిరాళము అత్యుత్సాహముతో ఇస్తాడు

ఇంతవరకూ కార్వే పండితుని జీవితమంతా స్త్రీజనోద్ధరణతోనే గడచిపోయింది. మహిళా విశ్వవిద్యాలయము కార్వే విశ్వవిద్యాలయమంటే గాని ఎవరికీ తెలియదు. ఆయనే విశ్వవిద్యాలయము - విశ్వవిద్యాలయమే ఆయన!

హింగ్ని వెళ్లినప్పుడు బృందావనమును దర్శించటము ఆయన కార్యక్రమములో ప్రధానమైనది ప్రియపత్ని సమాధిమీద దోసెడు మల్లెపూలు ఒక కన్నీటి బొట్టు విడుస్తాడు 'ఈ సహృదయ సహకారముతోనేకదా నా సంకల్పము నెరవేరినది!' అని మననము చేసుకొంటూ, మధురస్మృతు



అమ్మ ముద్దు

ఫొటో: సాళం రామేశ్వరరావు—రాజమండ్రి.

వనితాలోకం :

# అతను-ఆమె

పక్కింటివారమ్మాయి ఏదో అడిగింది ఆవిడ ఏదో సమాధానం ఇచ్చింది.

ఉదయం ఎనిమిదిగంటలవేళ టేబిలు ముందు కూర్చొని ఫైళ్లు వ్రాస్తున్న అతడికి మాటలు వినబడ్డాయనటానికి తగిన ఆస్కారం లేదు. కాని వినబడిన మాటల వల్ల మిగతాది తాను ఊహించుకున్నా డనవచ్చు.

ఆమె ఆ అమ్మాయితో బహుశా ఇంతే చెప్పివుండాలి. 'బహుశా' అనడంకూడా ఎందుకు గాని అక్షరాలా అదే అంత కన్నా వేరు సమాధానం చెప్పడానికి తావే అవకాశం ఇవ్వలేదనే అతని నమ్మకం... కాకపోతే అందులో ఆవిడ వ్యక్తిత్వం కూడా కొంత యిమిడివుండవచ్చు.

"చాలా బాగుంది...మిసర్వా...మాట్నీ..." ఇవి అతనికి పక్కింటివారమ్మాయి మాటలలో వినబడిన పొడిపలుకులు. దానికి సరిపోయిన నేపథ్యం అంతకుముందే వినికిడి వల్ల అతనిలో అమిరివుండడంవల్ల మిగతా మాటల సారాంశం ఊహించుకోవడంలో అతని కాట్టే కష్టం కలుగలేదు

ఇక ఈవిడ ఆ అమ్మాయికిచ్చిన సమాధానం సంగతి. అతని కందులో ఒక్క మాటకూడా వినిపించటంజరగలేదు అయినా ఆ సమాధానం పూర్వాపరాలు తనకు స్పష్టంగా తెలుసు కారణంవుంది. తన యిదివరకటి ప్రవర్తనా, ఆవిడ స్వతంత్ర ప్రాగల్భ్యమూ, ఇంకా అన్నిటికన్నా బలమైనది మరోటి—

ఆవిడ తలుపులుమూసి తిరిగి వస్తూంటే వ్రాస్తున్న ఫైళ్ళమీదుగా అతడామె ముఖంవైపు ఓరగా చూశాడు...ఆ ముఖంలో ఏ భావం లేదు .

తనభర్తనడిగి లాభంలేదనీ, అడిగి లేదనిపించుకునేకన్నా అడగకపోవటం ఉత్తమోత్తమమనీ, ఈవిడ పక్కింటివారమ్మాయికి చెప్పివుంటుంది అది తథ్యం!...

పెన్ను మూసి టేబిలుమీద వుంచి ఫైళ్లను బొత్తుపెట్టి కట్టకడుతూంటే అతని బుర్ర ఆ విషయంమీద తీవ్రాలోచన ప్రారంభించింది.

ఆవిడ సినీమాకు వెళ్ళి సుమారు అర్నెల్లై వుంటుందంటే ఆశ్చర్యం లేదు.. ఈలోపున తాను నెలకు అధమపక్షం రెండు సినీమాలైనా సగటున చూసివుండాలి. కాని ఆవిడ తన నడగలేదు. తాను తీసుకెడతా ననలేదు.

## వి. యస్. కళ్యాణి

పాపం! చూసి ఆనందించాలని ఆవిడకు మాత్రం ఉండదా?......పోనీ స్వయంగా అడిగినందువల్ల నష్టం ఏమిటి? అడుగుతే డబ్బు ఖర్చవుతుందని విసుక్కుంటాడని అనుకుని వుండవచ్చు కర్మకాలి . నిజమే ..... అప్పుడప్పుడీ విసుగనేది న్యాయాన్యాయాలు చూడనియ్యదు

వరండాలో పిల్లలిద్దరూ దేనికోసమో కీచులాడుకుంటున్నారు వంటింట్లో వున్న ఆవిడ కేకలు వెయ్యలేదు

'వినిపించటం లేదూ? పిల్లల్ని సముదాయించేపాటి తీరిక కూడా లేకుండా చేసే ఆ రాచకార్యం ఏమిటో?' .

ఫైళ్ళు ఎత్తికట్టి చేతులు వెనక్కు కట్టుకుని గదిలో పచారుచేస్తూ భార్యాభర్తల మధ్యనుండే అవకతవకల్ని గురించి తీవ్రంగా యోచిస్తున్న అతనే ఆ మాట అనటంలో దాదాపు అరిచినంత పనిచేశాడు!..

ఆవిడ వంటింట్లోనుంచి బయటికి వచ్చింది వేషభాషలు, రూపురేఖలు చాలా పనిమీదున్నట్టే వున్నాయి

అది అతనికి తోచకపోలేదు.

ఆవిడ అతనివంక కోపంగా చూడలేదు! అసలు చూడనే లేదు. తిన్నగా వెళ్ళి పిల్లలిద్దరికీ చెరో రెండేసి మొట్టికాయలూ వేసి రెండు చేతులతోనూ యిద్దర్నీ లెక్కట్టుకుని లాక్కెళ్ళింది వంటింట్లోకి!

పిల్లలు ఏవి తినబెట్టినా ఏడుపు మానరు కాని మొట్టికాయ లోనూరు రుచి చూపించాక ఓపకొని ఊరుకోరన్న విషయం ప్రతి తల్లీ ఎరుగున్నదే.

ఈసారి వాళ్ల రాగం షడ్జమంలోనుంచి షష్ఠమం, అష్టమం, యింకా యింకా ఎగువకివెళ్లి తారస్థాయి అందుకుంది.

"కొట్టడంతప్ప వేరేఉపాయం తెలిసేడుస్తేగా మన బుర్రలకి. వట్టి చవట బుర్ర"

తనమీద ఆవిడకున్న అభిప్రాయాలను గురించీ, ఇందాకా పక్కింటివారమ్మాయి సినిమాకురమ్మంటే బహుశా యిచ్చివున్నట్టు తను ఊహించుకున్న సమాధానంగురించీ, అటువంటి సమాధానం యిచ్చేందుకు తగిన కారణం తను కల్పించవలసి వచ్చినవిషయం గురించీ తీవ్రంగా యోచిస్తూ తర్జన భర్జనలు చేస్తూ, ఇకముందు తాను ప్రవర్తించవలసిన విధానంగురించి నిశ్చయాలు చేసుకుంటూ పచారు వేగం మరింత హెచ్చించిన అతనే తిరిగి ఆమాటలన్నది!. .

'అబ్బబ్బ తల పగిలిపోతూంది రోదన ధ్వనులకి . ఆవిడ మాట్లాడలేదు! ... అసలు తనంటూన్న మాటలు వింటూందా? విన్నా నిర్లక్ష్యంచేసి ఊరుకొంటూందా? అదీ కాకపోతే ఓర్పూ, సహనమూ కాబోలు!...

తరతరాలుగా విఖ్యాతిగాంచిన భారత స్త్రీహృదయంలోని ఆ విశిష్టలక్షణం క్షణకాలం అతని మనస్సులో మెరిసింది.

నిర్లక్ష్యమేనా అయివుండవచ్చు ? ... తననంటూన్నట్టు ఎరిగుండికూడా 'తనను కాదు లే' అన్నట్టు ఏమీపోయిందన్నట్టు ఊరుకోవడంకూడా ఓ గొప్పతనమే! కాదా మరి?

నోరుపారేసుకుంటే వచ్చేలాభం ఎల్లాగూ లేదు ఆవిడ అంతరంగం అతిగంభీరం. ఓపిసంగా తన వ్యక్తిత్వంమీద తిరుగులేని సవాల్ చేస్

తనని ఓవంక నిర్లక్ష్యం చేస్తూన్నదేమో నన్నశంక పీడిస్తూనా, అంతరాంతరాలలో ఏదో నిర్వచించరాని ఆనందం, గర్వం, కదలాడుతూన్నట్టు అతనికి స్పష్టంగా తెలుసు.

అయినా తను చేస్తూన్న పని లేదుకదా.. తాను పిల్లల్ని సముదాయించవచ్చునే!

తన మాటలతో ఆవిడను చిరాకుపరచవలసిన అవసరం ఎంతమాత్రం లేదే!

తానెందుకు సాయం చెయ్యలేదు?... తనకెందుకా విషయం తోచలేదు?... తనకు తోచిందల్లా ఒక్కటే . అది ఆవిడ బాధ్యత అని.

కాదు అది శుద్ధ.. ఊహాకల్పనం... న్యాయంలేదు ..

పనిలోవున్నా ఆవిడ తన మాటలు

---

లతో సుందరస్వప్నాలతో గృహోన్ముఖుడవుతాడు.

12 వ ఏప్రిల్ నాడు కార్వే పండితుడు తన 98 వ జన్మదినోత్సవము జరుపుకొన్నాడు. ఆయన ఇంకా పదికాలాలపాటు జీవించి స్త్రీజన పురోగమనాన్ని కన్నులపండువుగా ఆనందించవలెనని మహిళాలోకము కాంక్షిస్తున్నది

దేశమందంతటా స్త్రీలకొరకు అనేక పాఠశాలలు కళాశాలలు స్థాపింపబడుతూ వచ్చాయి—కాని మహర్షి ధొండో కేశవ కార్వే స్థాపించిన మహిళా విశ్వవిద్యాలయము వంటిది మరెక్కడా మనకు కనబడదు



చిరాకు కలిగినా వల్లెత్తుమాటకూడా అనక పోవడం శోచనీయం

అదే నిర్లక్ష్యంకాదు. ఓర్పు!. తన అన్యాయానికి సవాల్

ఈ భావవైరుధ్యాని కర్థం ఏమిటీ?... ఏంలేదు. వ్యక్తి ఒకడుకాడు. రెండు మూడు వ్యక్తుల సమ్మేళనరూపం మనిషిని పటాటోపం, అహంకారం, పరిస్థితులూ రూపొందిస్తాయి.

అంతరాత్మకి తెలుసు న్యాయా న్యాయాలు భా యిలా కాదు. ఇలా వుండకూడదు ఎరిగుండీ కూడా?. .మనిషి రూపు మారాలి ..

* * *

ఆవిడ వడ్డిస్తోంది అతడు తింటున్నాడు. ఓరగా ఆమె ముఖం పరిక్షిస్తూనే వున్నాడతను. ఆ ముఖంలో కోపంలేదు సరికదా, ఏ భావం వ్యక్తం కావడంలేదు. కొసరి కొసరి వడ్డించింది, అతడేమైనా తక్కువ తింటున్నాడేమోనన్న భయం కాబోలు.. అతడికి విసుగు వచ్చింది

పదిసార్లు వద్దన్నదే వేస్తాననడం గౌరవం, ప్రేమా, కాబోలు!.. అయినా అతడు ఏమీ అన లేదు

మాటలు చాలా మెత్తగా సున్నితంగా కూర్చుకుని అతనన్నాడు—"మినర్వాలోకి మంచి సినిమా వచ్చిందట" అని.

పోస్తూన్న మజ్జిగధారకు సూటిగా చెయ్యి పట్టి కళ్లు పైకెత్తి ఆవిడ ముఖంలోకి చూశాడు అదే సమయంలో ఆవిడా అతని కళ్లల్లోకి చూసింది. కాని. ...

అత డనుకున్నాడు—ఏమైనా అనక పోతుందా అని అతని అంచనా సరికాలేదు. కాని ఆవిడ మాట్లాడకపోనూ లేదు "కూర ముక్కలు వెయ్యమన్నారా నంచుకుం దుకు?". సహజమైన ఆదరాభిమానాల కా కంఠంలో ఏ కొఱతా కనిపించ లేదు

అతడు వద్దని తెలూపుతూ ఆవిడవంక చూశాడు. ఆవిడ మరోవైపు చూసింది

అతడు భోంచేసి లేస్తూంటే ఆవిడ తిరిగి అన్నది "వచ్చేటప్పుడు కాఫీ పొడరు మర్చిపోకండి" అని.

అంతసేపూ ఒక విషయంగురించి అతడు ఆలోచిస్తున్నాడు, చెప్పాలా వద్దా అని తనన్న మాటలు వినన ట్టే ఊరుకుందే! . నిర్లక్ష్యం.. చెయ్యటం చాతకానిపాటికి అంటేమాత్రం ఎంతని కాబోలు

ఆవిడ తనకేమని సమాధానం చెప్పాలి? తానడిగిందేమిటే? 'మినర్వాకి మంచి సినీమా వచ్చింద'ని అది ప్రశ్నకాదు సమాధానం రావటానికి 'ఏ సినిమా' అని అడగొచ్చుకదా అనుకుంటే అది ముందే తెలిసి వుండవచ్చు; అంచేత ఆవిడ మాట్లాడేందుకు తగిన సావకాశం కల్పించకపోవటం తన లోపమే.

డ్రెస్సు అయింతర్వాత సైకిలు వీథిలో పెట్టి అతడు వనక్కు వచ్చాడు గుమ్మాల దగ్గరగా.

ఆవిడ ప్రశ్నార్థకంగా చూసింది.

అత డన్నాడు "సాయంత్రం అయిదు గంటలకి వస్తాను మొదటాట సినీమాకు వెళ్దాం. తయారుగా వుండాలి" అని.

అత డావిడ కళ్లవైపు రెప్పవాల్చకుండా చూశాడు.

ఆవిడ రెండడుగులు ముందుకు వేసింది.

ఆవిడకళ్లల్లో క్షణకాలం వెలిగిన అపూర్వ కాంతిని అతడు స్పష్టంగా చూశాడు. లోలోపల ఆనందించాడు.

భోజనసమయంలో అతడన్నమాట విన్నప్పటనుండీ, ఆవిడ వినగోరిన మరోకమాటను విన్నానుగదా అనే అనుభూతి ఆవిడ పెద వులజంపుల్లో తొంగిలించింది

"ఆట ఆరుగంటలకి.. . తయారుగా వుండాలి అప్పుడదీయిదీ అంటూ ఆలస్యం చేస్తే కుదరదు "

మగజాతి సహజదర్పం ... ఆడవాళ్లదగ్గర ప్రతిమాటలోనూ ఏదో తన అధికారం చూపించాలన్న వాంఛ తెలియకుండాకూడా అప్పుడప్పుడు బయటపడిపోతూ వుంటుంది.

అయినా ఆవిడ కోపగించలేదు చిరునవ్వుతో తలవూపింది అతని 'ఆదరం'వల్ల కలిగిన ఆనందం ఆవిడకళ్ళల్లో తిరిగి తిరిగి వెలుగుతూనే వుంది

సైకిలు స్టార్టు చేసి ఎక్కబోతూన్న అతనికి అకస్మాత్తుగా స్ఫురించింది, చివర కొదిగా బయట పడిపోయినట్టు. చప్పున నాలుక కరుచుకున్నాడు.

స్త్రీజీవితంలో అప్పుడోక్షణం అప్పుడోక్షణం కలిగే అల్పసంతోషాలే చాలు, ఎప్పుడైనా తలుచుకుందుకూ పాత అనుభూతుల్ని నిత్యనూతనంగా అనుభవించేందుకూ.

సాయంత్రం అతను వచ్చేముందు ఆవిడ సిద్ధం అయింది పిల్లల్ని చిలకల్లా తయారు చేసింది

అతనూ వచ్చాడు ముచ్చటగా తయారైన భార్యా పిల్లల్ని చూశాక సంతోషించవలసిన అతని అంతరంగంలో ఏదో అపస్వరం పలికింది. ఏమిటి అంటే అది అతనికే అనిర్వచనీయం, ఓవిధంగా అవాంఛనీయం కూడా.

ఫలితంగా ?! ..

తెచ్చిన కాఫీ పొడరూ, మల్లెపూలూ - అతడు అనుకున్నంత మృదువుగా అందించలేకపోయాడు!

ఆవిడ అతనికి టిఫిన్ కాఫీ లిచ్చే హడావుడిలోవుంది. అతడామెవైపు రెప్పవాల్చకుండా చూశాడు.

ఆరెంజ్ కలర్ నీలి అంచు జరీ ఉల్లి చీర, పైన నల్ల క్రేప్ చోలీ,.. ఈ రెండూ ఓకానొక రోజున దబ్బున్నప్పుడు ప్రీతిగా తను కొనిచ్చినవే ఆ డ్రెస్సులో ఆవిడ చాలా 'గ్రాండ్'గా కనిపించింది.

ఆ 'శోభ' కతడు న్యాయంగా సంతోషించాలి. కాని అది అతనిలో ఎక్కడో అణిగివున్న 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్'ని కదిలించింది

ప్రతిరోజూ అతి సామాన్యంగావుంటూ, నూటికో కోటికో ఓరోజున, అందులోనూ ఓ సినీమాకి ఇంత 'గ్రాండ్'గా ముస్తాబవటంకూడా తక్కువతనాని కొక ప్రత్యక్ష చిహ్నం అని అతడు భావించాడు.

అతడి దృష్టిపథంలో ఆఫీసులో పనిచేసే లేడీ టైపిస్టు గోచరించింది

రోజుకోక రకం చీరలో ఇంద్ర ధనుస్సులా మెరిసే లేడీ టైపిస్టు! ఆవిడ దగ్గరకి పని కల్పించుకుని తిరిగే బాచిలర్సూ...

రోజూలేని గొప్పతనం ఓరోజున కొన్ని గంటలకోసం అరువు తెచ్చుకుంటేమాత్రం సహజంగా వుంటుందా? ఉన్న ఒకటి రెండు 'గొప్పల్ని' ఘనంగా చూపెట్టుకుంటే గొప్పవాళ్లయిపోగలరా?...ఎందుకీ పటాటోపం...ఆడంబరం? ..

ఇప్పుడూ సామాన్యంగా ఎందు కుండకూడదు?. అతడికి తెలుసు బహుశా ఏ తెల్ల చీరో సామాన్యంగా కట్టుకుంటేకూడా తనకే 'తక్కువ తనం' ఫీలవటం తప్పదేమోనన్న అనుమానం కలుగ వచ్చునని! ..

అయినా ప్రతి చిన్న విషయంమీదా యింత భావసంఘర్షణ ఎందుకు?

మనిషి మనస్సులోని తెలిసినా తెలియని రహస్యమే అది మన స్తత్వానికి 'లాజిక్' తెలియదు. అందుకే ఈ ఎందుకూ పొందని పేకులాట.

'చాలా గ్రాండ్ గా తయారయ్యావే'

అత డనుకున్నది కంఠానికి మృదువైన వేషం కప్పి సామాన్యంగా అందామని. కాని...

అందులో ఏదో వెటకారం, ఎత్తిపొడుపూ స్ఫురించనే స్ఫురించాయి! ఆవిడ అతనివైపు తీక్ష్ణంగా చూసింది. అతనికీసారి ఆ చూపుల్లో భావం చెంపదెబ్బకొట్టి నట్టు స్ఫురించింది

గడచిపోయిన కాలంలో ఓ దుర్ముహూర్తాన తనే అన్నట్టు జ్ఞాపకం ..'ఎక్కడికెళ్ళినా ఈ లేకిఅవతారం తప్పదేమిటే?' అని కర్మం! ....

అప్పుడు తనెందుకన్నాడలా?...ఆఫీసరు యింటికి విందుకు వెళితేమాత్రం... తనప్పుడు వేషాడంబరం కోరినమాట వాస్తవం! గొప్పవాళ్ల ముందు ఆత్మకి విరుద్ధంగా తక్కువతనాన్ని కప్పుకోవాలని ..

# ★ అతను - ఆమె ★

అవును .. తన మనస్సప్పు డావిధంగా యోచించినది తథ్యం...

తెలుసుకున్నప్పుడల్లా ఎందుకు తను చెప్ప లేని బిడియంతో కుంచించుకుపోతాడు?

ఎందరు వేషాడంబరంతో, ఫటాటోపంతో సూటిగా సాగిపోవడం లేదు? .. మనస్సుల్లో ఈ 'ఇన్‌ఫీరియారిటీ' అందరికీ తప్పదా? లేక తనొక్కడికేనా?...

ఎంతటి ఆత్మవంచన?!...ఎంతటి స్వవచన వ్యాఘాతం?! .

ఒకసారి తలచినది మరోసారి పనికిరాదు. తనలోని ఈ భావసంఘర్షణకి భార్యని గురి చేస్తున్నాడు కాబోలు...

లెంపలేసుకోమంది హృదయంలో ఓమూల అజ్ఞాతంగా పడివుండి అప్పుడప్పుడు కదిలాడే అంతరాత్మ

అతడు తలవంచుకుని టిఫిన్ పూర్తిచేసి కాఫీ త్రాగడం ప్రారంభించాడు...

బొత్తిగా స్వయంపాకం వ్యవహారం అయిపోయింది! ఆవిడడిగింది; 'ఖానీ చీర మార్చెయ్యమన్నారా' అని. ఆవిడ నొచ్చుకుంది అవును తన మనస్సూ చివుక్కుమంది...కాని...

సాధ్యమైనంతమార్దవం కంఠంలో నింపాలని ప్రయత్నిస్తూ, "గ్రాండ్ గా వున్నదంటే చీర మార్చెయ్యమని ఏ డిక్షనరీలోనూ లేదు". అన్నాడు.

ఎందుకీ అన్యాపదేశం ? .. చెప్పేది సూటిగా చెప్పకూడదూ. ? పురుష సహజమైన దర్పం.. ఆవిడ మాట్లాడకండా ఊరుకుంది...

*  *  *

సినిమాహాలులో అప్పటికే చాలామంది వున్నారు. ఓలైను చివరగా ఆవిడని కూర్చోమని పక్కన కూర్చున్నాడు అతను వచ్చేవాళ్లూ - పోయేవాళ్లూ, గ్రామఫోను రికార్డుల గందరగోళం, మధ్యమధ్య మనుష్యుల మీదినుంచే వెళ్ళిపోయే త్రొక్కిడీ నానా రభసగానూ వుంది .. హాలంతా ఓమారు కలయజూశాడు.

ముందుసీట్లవాళ్లు వెనక్కి తిరిగి తిరిగి ఏంచూస్తారు?.. వెధవలు .. రౌడీమూకలు ........

ఆవిడవైపు చూశాడతను. ప్రశాంతంగా కూర్చొని ఎటో చూస్తోంది. అటునుంచే కొందరామెవైపు చూస్తూన్నట్టు కనీసం అతనికి కనిపించింది...

ఆవిడకు తెలియదా ఆసంగతి?!...

ఆక్షణంలో ఆమె ఏ మూలో చిన్నబోయిందేమో?...

అబ్బ...వెధవ గొడవ . గందరగోళం. .

తొందరగా సినిమా అయినా స్టార్ట్ చెయ్యరేం చెప్మా?...

బహుశా ఆ సినిమావాడుకూడా హాల్లో ఆడవాళ్ళని పరీక్షిస్తూ పరధ్యానంగా వున్నాడు కాబోలు కర్మం

బిస్కట్ల కుర్రవాడు దగ్గరకొచ్చాడు. అతడు మాట్లాడలేదు. పాప ఆవిడ చెవి కొరికింది. జాలిచూపులు చూసింది ఆవిడ వద్దని ఆ కుర్రాణ్ణి పంపించి పాపని సముదాయించటం అతడు ఓరకంట చూశాడు

అక్కడికి తనాపాటి చెయ్యలేకపోయినట్టు?! ..లేచి రెండంగల్లో ఆ కుర్రాణ్ణి పట్టుకుని బిస్కట్లు కొని తెచ్చి పాపకిస్తూ ఆవిడవంక చూశాడు.

విజయగర్వం కాబోలు!...ఆవిడ లోలోపల నవ్వుకుంది. తనమీద అతనికి విజయమా!.. తను కాదంటేకద .. అహంకారం.. తను చెయ్యలేని పని చేసి ఏదో పెద్దరికం సాధించినట్టు .

పాప నవ్వుతూ బిస్కట్లు చప్పరిస్తోంది. చంటివాడు అక్క చేతిలో బిస్కట్టు లాగి తానూ కొరికాడు...

ఒక్కసారిగా హాల్లో లైట్లారిపోయాయి తెరమీద బొమ్మ నెమ్మదిగా ప్రక్కకి జరిగింది...

గడచిన జీవితాన్ని జీర్ణించుకున్నవారి హృదయాలమీద ఏదో తెర జరిగినట్టూ, ఎట్టయెదుట ఒక నూతన ప్రపంచంలోకి అడుగు పెట్టబోతూన్నట్టూ, అందులోని ప్రజలలో తామూ ఒకరు కాబోతూన్నట్టూ నవ్యానుభూతులేవో కళ్లమీద ముసురుకున్నాయి ..

ఆట నడుస్తోంది. పాత్రధారులందరూ చక్కనివాళ్లే నాయికా నాయకులు ఒకరి హృదయాల నొకరు తెలుసుకుని ప్రవర్తిస్తారు ..ఆ ప్రపంచంలోనూ కష్టసుఖాలున్నాయి కాని సాధారణ జీవితపు నిత్యానుభూతులకీ వాటికీ ఏదో తేడా కనిపిస్తుంది. మరో లోకం సినిమా చూస్తున్నంతసేపూ అదొక స్వప్నసుఖం ..

హీరోయిన్ అంగాంగ సౌందర్యం అతడిని ముగ్ధుణ్ణిచేసింది. ఆమె నవ్వుల్లో చూపుల్లో నడకల్లో, నడతలలో అణువణువునా మూర్తీభవించిన అమరసౌందర్యం అతణ్ణి పరవశుణ్ణి చేసింది. ఆమె నృత్యం చేస్తూంటే అతని హృదయం లయ కలిపింది.

హీరో పలుకుల్లో వెల్లువలై ప్రవహించిన ప్రేమ, మార్దవం అజ్ఞాతస్థితిలో నిద్రాణంగా ఉండిపోయిన ఆమె హృదయతంత్రులను మ్రోయించాయి. 'అతని'లోని మృదుత్వం ఆవిడ హృదయం కరిగించింది.

పాప మంచినీళ్ళడిగింది. చంటివాడు ఒళ్లో నిద్రపోతున్నాడు. ఆవిడ అతనికి చెప్పింది. తన సుందరస్వప్నం చెదరిపోయిన ట్టుగా ఫీలయ్యాడతను. కసురుకున్నాడు 'ఇంటర్వల్ కానీ' అంటూ.

కాని ఈ అనుభవాలు పాపకి దూరం . మంచినీళ్లు కావాలి పాప ఆగనియ్యదు. హోటలుకుర్రాడు కనిపిస్తే చెప్పి తెప్పించి పాపకిప్పించింది. అతడావిషయం బహుశా ఎరిగుండడు.

ఇంటర్వెల్‌లో వద్దంటున్నా వినకుండా లైమ్‌జ్యూస్‌లు ఇప్పించాడతను పిక్చరులో మునిగినప్పటి పరిపూర్ణానందానుభవం అతణ్ణి వేరే ఆలోచించనియ్యలేదు కాని ఆవిడకు తెలుసు అందులో చిక్కు అంగుళం నే కాబోలు ఆ ఆనందం పంచుకుందుకు సందేహించిందావిడ

ఆటైపోయింది. విద్యుద్దీపాల వెలుగు వెల్లువ హాలును ముంచెత్తింది.

ప్రేక్షకుల కళ్ళమీద కాంతుల పొరలు చెదరిపోయాయి తిరిగి ఈ ప్రపంచం, ఈ వెలుగుచీకట్లూ, అవక తవకలూ, అంతరుద్ధాలూ, శంకాసందేహాలూ కళ్లు విప్పేయి

హాల్లోంచి బయటికి వస్తూ అన్నాడతను "టక్కెట్టు డబ్బులు ఆ హీరోయిన్ వేషానికివ్వవచ్చు" నని ..

ఆవిడ ఈమారూరుకోలేదు. తన ఆనందాన్ని తాను వెలిబుచ్చింది. "ఆ 'ఫలానా' యాక్టర్ మాత్రం?.. ...ఎంత చక్కగా మాట్లాడేడండీ" ఆవిడకు కలిగిన ఆ ఆనందం ప్రతి అక్షరంలోనూ వ్యక్తమయింది.

రోడ్డులో నడుస్తూ అతననుకున్నాడు. తను హీరోయిన్‌ను మెచ్చుకున్నంగుడు ఆవిడ హీరోను మెచ్చుకుంటోందా? . ఈర్ష్య!...

తిరిగి అతనికి చెంపపెట్టుగా తట్టింది మరోవిషయం. తనలాగ ఆవిడ ఆనందం ఎందుకు వెలిబుచ్చకూడదు ? ... ఆమాటలకి తన మనస్సెందుకు తబ్బిబ్బులు తడుముకోవాలి? గుమ్మడికాయలదొంగ తను కదా?!

అయినా పెద్దమెచ్చుకోతగ్గది ఆహీరోలో అతనికేం కనిపించలేదు ..

"ఆ హీరోమాటకేంలే ... బొంగురుముద్ద గొంతుకా, వాడూ .." -

హీరోయిన్ నటనాకౌశలాన్ని మరో రెండుసార్లేనా అతడు పొల్లుపోకుండా పొగిడివుంటాడు.

ఆవిడ మాటాడలేదు ఆడదాని అందం మరో ఆడది మెచ్చుకోలేదు జెలసీ!... అనుకున్నాడతను

ఆవిడ లోలోపల నిశ్చయించుకున్నదల్లా ఒకటి - ఆడవాళ్ళ సౌందర్యం మగవాళ్లకీ, మగవాళ్ల అందం ఆడవాళ్ళకీ 'అప్పీల్' చెయ్యడంలో అసహజం ఏమీ లేదు. అది ప్రకృతిసిద్ధం. అందమైన ఆడవాళ్లనీ మగవాడు వర్ణించి, అందులోనూ భార్యల

(49-వ పేజీ చూడండి)



# చిలిపి కృష్ణుడు

కాసుఖేల సోమేశ్వరరావు

చిలిపిచేష్టల చిన్నికృష్ణుడు
చిరుతగజ్జెలు చిందులాడుచు
ఘల్లుఘల్లురనంగ మెల్లగ
తల్లి ఒడిలో వచ్చి పడియెను.

వెన్నదిని తెలుపెక్కిపోయిన
పాలబుగ్గల తడిమి నీటగు
నెమిలిపింఛము నిమిరి, చెదరిన
ముంగురులనూ సర్ది, మురిసీ

యశోదమ్మా అడిగె కృష్ణుని
"చిట్టితండ్రీ ఏమికావలె,
ఇప్పుడేగద వెన్నయిచ్చితి
ఇంతలోనే ఆకలటరా?"

ఉట్టిచూపి కృష్ణుడనియెను:
"గిన్నె కావలెనమ్మ ఇప్పుడు
నీ వొసంగిన వెన్నముద్దా
సగము బలరామన్న తినియెను."

"నేను కొట్టెదలెమ్మ రాముని;
పోయి కాసే పాడుకొనుమూ
పాలగిన్నెను ఇపుడుతీయను
చాల యెత్తుననుంది అందదు."

"ఎపుడు ఇచ్చెదవమ్మ అయితే?"
"రాత్రివస్తే ఇత్తుతండ్రీ"
"రాతిరనగా నెటులయుండును?"
"లోకమున చీకట్లు కమ్మును."

కొంటెకృష్ణుడు వెంటనే తన
కళ్లురెండూమూసి యడిగెను:
"పోయి త్వరగా పాలు దేవే
రాత్రివచ్చెను చీకటాయెను."




# ఈసప్ కథ

నండూరి రామమోహనరావు

గ్రీసుదేశమందు కలడు
ఈసప్ అను బానిసీడు
ఏసుక్రీస్తువలెనె వెన్న
పూసవంటి మనసువాడు.

ఏమతేని హానిచేయ
చేతులాడనట్టివాడు
చిలుకలతో, ఎలుకలతో
చెలిమిచేయునట్టివాడు.

పిదనవాడు నడుమంధ
వెంగలియని జనులెల్లరు
వేషంగుల వేధింతురు
వేడుకకై బాధింతురు.

పిల్లలకత డెదురుపడిన
పిలుతురతని తాతా యని;
పిటకథలు చెప్పుమనుచు
పీకులుబు తిందురతని.

ఊరిపడమ చెట్టునీడ
జేరిచెప్పు నతడు కథలు.
దారిబోవు జనులుగూడ
కారుమంది వినుచుందురు.

పిట్టలపై పిల్లులపై
తోడేళ్లపై నక్కలపై
పెట్టి యతడు నీతిగఱపు
కట్టుకథలు చెప్పుచుండు.

దైసందిన జీవితమున
మానవులకు పనికివచ్చు
జ్ఞానమతని కథల పూల
దేనెలట్లు దాగియుండు

సమాజాల స్థితి గతులను,
సంఘ దురాచారములను,
సంకోచములేక వ్యంగ్య
సరణి విమర్శించునతడు.

అన్యాయ ప్రవర్తకుల
నధికారమదోన్మత్తుల
నసిధారా నిశితకథల
నవహేళన జేయునతడు.

ఏసుక్రీస్తు, సోక్రటీసు
ఏగతి మృతిజెందిరొ తా
ఎవరిచేతులందొ కడకు
ఈసప్ కడతేరినాడు.

మంచి చెడ్డలందు దక్క—
మనుజులంద రొకటేయని
మదినమ్మిన నేరమునకు
మరణశిక్ష పొందినాడు.

సామ్రాజ్యము లంతరించి
సమ్రాట్టులు నమసిపోయి
శతాబ్దాలు గడచెగాని
నమసిపోవ దతనికీర్తి

వారవార మీపుటలో
ధారావాహిక రీతిని
నా రచించు గీతుల కా
ధారమతని పిట్టకథలె.

కలకల లే నగవు లొలుక
కదలిరండు పిల్లలార!
కైకొనుడిది మీ కొరకే
కథాగేయ సుధానిధి!




## జరిగిన కథః

ఫ్రాన్సుదేశంలో విప్లవం ఉధృతంగా ఉన్నరోజులు - చాలామంది ప్రభువంశీకులకు శిరచ్ఛేదం విధించబడింది. ఉన్నట్టుండి ఇలా శిక్షలు విధించబడినవారితో సహా, చాలామంది ప్రభువంశీకులు తప్పించుకు పారిపోవటం మొదలుపెట్టారు. కొంతమంది ఇంగ్లీషువారు సంఘంగా ఏర్పడి వారిని తప్పిస్తున్నారని వదంతులు బయలుదేరినాయి. వారి నాయకుడు ఎవరో ఎవరికీ తెలియదు స్కార్లెట్ పింపర్నల్ అనే మారుపేరుతో వ్యవహరిస్తుంటాడు ఈ స్కార్లెట్ పింపర్నల్ బిబట్ అనే ద్వార రక్షకుని కళ్లల్లో దుమ్ముకొట్టి, కౌంటెస్ డి టూర్నేను ఆమె పిల్లలు సుజేన్, వైకౌంటులను తప్పిస్తాడు. వారు ఛానెల్ దాటి ఇంగ్లాండు చేరుకుంటారు మార్గరెట్ అనే ఫ్రెంచియువతి, సర్ పెర్సీ అనే ఇంగ్లీషు వానిని పెళ్లిచేసుకొని లండన్ వచ్చేస్తుంది ఈమె కూడా పెళ్లికాకముందు ఒకసారి ఒక ప్రభువుకు మరణశిక్ష వేయిస్తుంది ఇంగ్లాండులో ఉండగా ఆమెను ఎన్నడూ కలుసుకోవటం తటస్థించరాదని కౌంటెస్ కోరుకుంటుంది. కాని కౌంటెస్ ఇంగ్లాండు చేరిన కొద్దిగంటల్లోనే ఆమె ఉన్న హోటలుకే మార్గరెట్ వస్తుంది. ఆమెపై తనకున్న ద్వేషం కొద్దీ కౌంటెస్ మార్గరెట్ ను నలుగురిలో అవమానపరుస్తుంది తరువాత సర్ పెర్సీ కూడా లోపలికి వస్తాడు సర్ పెర్సీ వట్టి మందమతి, బద్ధకస్తుడు వైకౌంట్ సర్ పెర్సీతో కలహానికి తలపడతాడు. కాని పెర్సీ వేళాకోళంగా మాట్లాడి కలహం తప్పిస్తాడు మార్గరెట్ ఫ్రాన్సుపోతున్న తన సోదరుడు అర్మాండ్ ను సాగనంపటానికి బయలుదేరుతుంది.

## 4

ఆహార శాలలోనుండి ఇవతలికివచ్చి, వరండాలో, మసక వెలుతురులో నిలబడి, మార్గరెట్ భారంగా నిట్టూర్పు విడిచింది ఇందాకటినుండి పైకి ఎంత హుషారుగా కన్పించినా ఆమె లోలోపల కించపడుతూనే ఉన్నది నలుగురిలోనుండి బయటపడి, ఒంటరిగా నిలబడిన తరువాత ఆమెకు దుఃఖం ఆగలేదు. కన్నులలో నీరు సుడులు తిరిగింది.

వర్షం ఆగిపోయింది. చల్లగా వీస్తున్న గాలికి మబ్బులు తేలిపోతున్నాయి. దూరాన పశ్చిమంగా సూర్యుడు మబ్బుతెరలు చీల్చుకొని భూమికి అవతరిస్తున్నాడు. ఇంత గాలివాన వెలిసినపిదప, మబ్బుల్లోనుండా చొచ్చుకొనివస్తున్న సూర్యకిరణాల వెలుగులో ప్రకృతి మనోజ్ఞంగా ఉన్నది.

ముందుకు నాలుగు అడుగులు వేసి దూరాన కనిపిస్తున్న సముద్రంవంక చూసింది మార్గరెట్. నీలి సముద్రములో, బూడిదరంగు ఆకాశం తెరముందు, రేఖామాత్రంగా ఉన్నట్లు తోచే నావ కనిపించింది. ఆ నావ సర్ పెర్సీ బ్లాకెనీది. గాలిపోసుకుంటున్న తెరచాపలతో ప్రయాణానికి సిద్ధంగా ఉన్నది. ఈ డేడ్రీమ్ లోనే మార్గరెట్ సోదరుడు అర్మాండ్ ఇప్పుడు ఫ్రాన్సు పోవలసిఉంది.

డేడ్రీమ్ నడిపే నావికునితో కలిసి అర్మాండ్ ఫిషర్ మన్స్ రెస్ట్ సమీపించాడు. సోదరుని చూడగానే మార్గరెట్ ముఖానికి కళవచ్చింది. "అర్మాండ్!" అని ఆప్యాయంగా పిలుస్తూ ఎదురువెళ్లింది. నావికుడు బ్రిగ్స్ వినమ్రుడై దూరంగా నిలబడ్డాడు!

"ఎంత సేపటిలో బయలుదేరాలి? బ్రిగ్స్!" అనిఅడిగింది మార్గరెట్.

"అరగంటలో బంగరెత్తాలి అమ్మా!" అని బదులుచెప్పాడు బ్రిగ్స్.

చేయీచేయిపట్టుకొని ఆర్మండ్, మార్గరెట్ బయులుదేరారు. మార్గరెట్ సంభాషణ ప్రారంభించింది.

"నాకేమో దిగులుగాఉంది. నువ్వు ఇప్పుడు ఫ్రాన్స్‌పోవటం నాకు బొత్తిగా ఇష్టంలేదు."

"దిగులుదేనికి మార్గరెట్? నేనేమి ఖండాంతరం పోతున్నానా ఏమన్నానా? జానెడుబెత్తెడు ఛానెల్ దాటి, అలాపారిస్‌పోయి మళ్లీపదిరోజుల్లో వచ్చేస్తుంటిని."

"నిజమే! కాని ఫ్రాన్స్‌లో పరిస్థితులేమి బాగా లేవు. నాకు మాతృదేశాభిమానం లేకకాదు. కాని అక్కడి వ్యవహారాలు శ్రుతిమించి రాగాన పడుతున్నాయి. కాదూ?"

ఆర్మండ్ తొట్రుపడి "ఇశ్!" అంటూ ఆమెను వారించాడు. "అలామాట్లాడకు. ప్రమాదం! ఫ్రాన్సుకు దూరంగా ఇక్కడ ఇంగ్లాండులో ఉన్నంత మాత్రాన అలామాట్లాడ వచ్చుననుకుంటున్నావేమో!"

మేము ఎప్పుడు మాట్లాడుకున్నా స్కార్లెట్ పింపర్నల్ గురించే.

మార్గరెట్‌కు ఆమాటలు చెవి కెక్కలేదు. "ఆర్మండ్! నువ్వుపోవద్దు. నామాటవిను. పోబోకు." అని మళ్లీమళ్లీ ప్రాధేయపడసాగింది. మార్గరెట్ గొంతువణికిపోతున్నది.

"ఇలా అయితే ఎట్లామార్గరెట్! ధైర్యంగా ఉండాలికాని! మాతృదేశం ప్రమాదస్థితిలోఉన్నప్పుడు, ఎవరిమటుకువారు ఊరుకుంటే కుదురుతుందా చెప్పు!"

"అదికాదు ఆర్మండ్! ప్రపంచంలో నా అన్నవారెవరైనాఉంటే నీ వొక్కడివేనాకు."

"అదేంమాట? పెర్సీలేడూ? నీవంటే పెర్సీకి ఎంతప్రేమ! ఎంతఇష్టం!"

"ఒకప్పటిమాట."

"ఇప్పుడు ఏంవచ్చింది?"

"పోనిద్దూ! ఆగొడవంతాచెప్పి నిన్నుకూడా ఇబ్బందిపెట్టటం దేనికి?"

"మార్గరెట్! అదేనా నువ్వనవలసిన మాట? నాకునీవు, నీకునేను ఆప్తులము. నాదగ్గిర దాచటం ఎందుకు చెప్పు!"

మార్గరెట్ ఏమీ మాట్లాడలేదు. ఏదోగుర్తు వచ్చినవాడిలాగా ఆర్మండ్ మార్గరెట్‌వంకచూసి ఇలాఅడిగాడు. "నేనోమాటఅడుగుతాను. చెప్తావా? నీకిష్టంలేకపోతే చెప్పక్కర్లేదు."

"ఏమిటది?"

"మార్క్వెస్ డి సెంట్‌కర్ మరణశిక్షసంగతి- అంటే నీవలన ఆ శిక్ష పడిందన్నసంగతి సర్‌పెర్సీకి తెలిసిందా?"

మార్గరెట్ వెగటుగా, విషాదంగానవ్వింది. "తెలుసు. పెళ్లిఅయినతరువాత నేనే చెప్పాను."

"ఏపరిస్థితులలో అదిజరిగిందో, ఎలాఅది సంభవించిందో అంతాచెప్పావా?"

"అదంతా వివరంగా చెప్పటానికి అప్పట్లో వీలులేకపోయింది. ఏమిజరిగిందో నేను. చెప్పకముందే ఇతరులవల్ల ఆయనవిన్నారు. ఆతరువాతకూడా నేను ఆయనతోనంగతిఅంతా చెప్పలేకపోయాను ఎలా చెప్పను ఆర్మండ్? ఒకచెంప ఆయన నన్ను అలా అసహ్యించుకుంటుంటే, ఎదుటికివెళ్లి మాట్లాడటం ఎట్లా?"

చెల్లెలితత్త్వం బాగా తెలిసిఉండటంచేత ఆర్మండ్ ఆవిషయం ఇంకా చర్చించకుండా మూభావంగా ఊరుకున్నాడు. ఆర్మండ్, మార్గరెట్ చిన్నప్పటినుంచి అన్యోన్యంగా పెరిగారు. మార్గరెట్ ఇంకా చిన్నపిల్లగా ఉండగానే, ఆర్మండ్ యవ్వనంలో అడుగు పెడుతున్న తొలిరోజులలోనే తల్లీతండ్రి ఇద్దరూ చనిపోయినారు. మార్గరెట్ పెళ్లిచేసుకొని ఇంగ్లాండు వచ్చేసినతరువాతనే అన్ననివిడిచి మొట్టమొదటిసారిగా కొంతకాలంపాటు ఉడటం. మార్గరెట్ పెళ్లి అయినతరువాత ఆర్మండ్ ఇంగ్లాండురావటంకూడా ఇదే మొదటిసారి.

ఇప్పుడు మళ్ళీ అర్మండ్ తనను విడిచివెళ్తున్నాడు. పారిస్‌లో పరిస్థితులు కల్లోలంగా ఉండటంచేత మార్గరెట్‌కు అతడు ఫ్రాన్సువెళ్లటం బొత్తిగా ఇష్టంలేదు. కాని ఆర్మండ్ ప్రయాణం మానుకోవడానికి ఇష్టపడలేదు.

ఆర్మండ్ బయలుదేరవలసిన సమయం ఆసన్నమైంది. అన్న చెయ్యిపట్టుకొని మార్గరెట్ సముద్రం వొడ్డుదాకా వెళ్లింది. ఆర్మండ్ డే డ్రీమ్‌లోకి ఎక్కి చెల్లెలివంకచూచి చేయిఊపాడు. నావ కదిలింది. తరంగాలమీద నాట్యంచేస్తూ, అనుక్షణం దూరమైపోతున్న డే డ్రీమ్ కంటికి కనిపిస్తున్నంత వరకు మార్గరెట్ అక్కడేనిలబడింది.

సముద్రం మీదినుంచి వస్తున్న పిల్లగాలికి నొక్కులు తిరిగిఉన్న వినీలశిరోజాలు ఎగిరి ముఖం మీదపడుతున్నాయి. వెనకదూరాన వెలుగుచీకట్ల కలయికలో కనుపించీ కనుపించకుండా ఉన్న ఫివర్ మన్స్ రెస్ట్ కిటికీలగుండా ఎఱ్ఱటి దీపాలకాంతి వస్తున్నది. మార్గరెట్ వెనుదిరిగి హోటలు వైపు నడక సాగించింది.

హోటలు సమీపించినకొద్దీ, అందులో ఇష్టాగోష్ఠి కబుర్లుచెప్పుకుంటూ, మధ్య మధ్య విరగబడి నవ్వుతున్న మిత్రబృందంవారికంఠధ్వనులు వినిపిస్తున్నాయి:

ఇంతలో ఒకవిదేశీయుడు మార్గరెట్‌కు ఎదురుపడ్డాడు. ఆలోచనలలో తలమునిగి తాటి ప్రమాణంగా ఉన్న మార్గరెట్ ఎదురువస్తున్న విదేశీయుని గమనించలేదు. ఆవిదేశీయుని ప్రక్కనుండి దాటిపోతున్న సమయంలో, అతడు మెల్లిగాపిలిచాడు.

"మార్గరెట్ సెంట్ జస్ట్!"

మార్గరెట్ ఉలిక్కిపడింది. పెండ్లికాకముందు ఆమెపేరు మార్గరెట్ సెంట్ జస్ట్. ఇక్కడఅందరూ ఆమెని మార్గరెట్ బ్లాకనీఅనే పిలుస్తారు. ఆశ్చర్యంతో ప్రక్కకు తిరిగిచూసింది.

"షావలిన్!"

వినయంగా తలవంచుతూ, "ఆహా! సాక్షాత్తూ......" అన్నాడు విదేశీయుడు.

ఒకటి రెండు నిమిషాలసేపు మార్గరెట్ ఏమీ మాట్లాడలేకపోయింది. సంతోషంతో, విస్మయంతో, పైనుండి క్రిందిదాకా అతనిని తేరిపార చూసింది.

షావలిన్ పల్లికిలించుతూ ఒక్కపట్టు నవ్వం వేసుకొని, చేతులురెండూ శుభ్రంగా దులుపుకొని, నలుపుకుంటూ నిలబడ్డాడు.

షావలిన్‌ను చూస్తుంటే పారిస్‌లో గడిపిన వెనకటి రోజులన్నీ గుర్తువచ్చినాయి మార్గరెట్‌కు. ఇన్నాళ్ల తరువాత ఒక పాతమిత్రుడు అనుకోకుండా కనిపించినందుకు మార్గరెట్ చాలా సంతోషపడింది.

"సరేగాని, నువ్వు ఫ్రాన్సునుండి ఎప్పుడు ఊడిపడ్డావు ఇక్కడికి? ఇక్కడేంచేస్తున్నావు? చెప్పు, చెప్పు కథంతా!" అని ఉల్లాసంగా అడుగుతూ, నడక సాగించింది. షావలిన్ వెనుకకుతిరిగి, మార్గరెట్ వెంట నడిచాడు.

"ఊఁ! నీవేంచేస్తున్నావు ముందుచెప్పు." అని అడిగాడు షావలిన్:

"చేసేటందుకేముంది? ఏమీలేదు"

"అదే అదే! నీవంటిదానికి ఇంగ్లాండులో పొద్దుపోవటం చాలాకష్టం. ఏంచేస్తాం? నీకు ఇంగ్లాండుమీద మోజుపుట్టింది!"

మార్గరెట్ సన్నగా నవ్వింది. "బొత్తిగా ఏమీ తోచదు ఒక్కొక్కసారి. మహా విసుగు పుడుతుందనుకో."

"పోనీ అలా ఊరికే చిరాకుపడుతూ కూర్చోకపోతే జన్మభూమి కేమయినా సేవచేయరాదూ?"

ఈమాటలు అన్నతరువాత, షావలిన్ మార్గరెట్ సమాధానం చెప్పకముందే, మాట్లాడుతున్న ధోరణి, కంఠస్వరంమార్చి ప్రాధేయ పడుతున్నట్లు, ఉద్బోధిస్తున్నట్లు చెప్పటం మొదలుపెట్టాడు.

"ఫ్రాన్స్‌దేశం ఇప్పుడు అనేక కష్టాల పాలయింది మార్గరెట్: నీవు అమోఘమైన తెలివితేటలు



# స్కార్లెట్ పింపర్నల్



కలదానివి. నీవంటివారంతా ఎవరిబిడ్డో తెమ్మన్నట్లు ఊరుకుంటే, ఈ విపత్సమయంలో మాతృదేశాన్ని ఆదుకోకపోతే, పూనుకొని నడుముకట్టి కార్యభారం నిర్వహించకపోతే, జాతికి భవితవ్యం ఉండదు. మన దేశానికి సద్గతిఉండదు. ఉన్నతి ఉండదు. మార్గరెట్! నీ మాతృదేశం నిన్ను అర్థిస్తున్నది. ఒక్క చిన్న సహాయం చేసిపెట్టరాదూ?"

ఉన్నట్టుండి యింత వింతగా మాట్లాడటం ప్రారంభించిన షావలిన్ వంక మార్గరెట్ ఆశ్చర్యంగా చూసింది. షావలిన్ ముఖం మహా తమాషాగా ఉంటుంది. పలచనిగడ్డం, పెదవులు - లోతైనకళ్లు - అతడు ఒక్కొక్కసారిచూస్తుంటే అచ్చగా ఒక గుంట నక్కచూసినట్లే ఉంటుంది. అర చేతులు నలుపుకుంటూ, నక్కవినయం ప్రదర్శిస్తూ అతడుపెట్టిన ముఖభంగిమ చూసి, నిర్లక్ష్యంగా నవ్వుతూ, మారాముచేసే చిన్న పిల్లలాగా ముఖంపెట్టి, మార్గరెట్ అడిగింది, "ఏమిటి? ఏమిటిసంగతి? ఉన్నట్టుండి యిలా మారిపోయినావు! ముందు విషయమేమిటో చెప్పు మాతృదేశానికే సహాయం చెయ్యాలో, నీకేచెయ్యాలో తరువాత చూద్దాం!"

మొదలు, తుది, సందర్భం, లేకుండా షావలిన్ "నువ్వెప్పుడయినా స్కార్లెట్‌పింపర్నల్ అనే పేరు విన్నావా?" అని అడిగాడు.

"స్కార్లెట్‌పింపర్నల్?" పక పక నవ్వింది మార్గరెట్. "భలే ప్రశ్న అడిగావులే! మేము ఎప్పుడు మాట్లాడుకున్నా స్కార్లెట్‌పింపర్నల్ గురించే స్కార్లెట్‌పింపర్నల్ పేరు లేనిదే ఒక్క ఫాషన్ ఉండదిప్పుడు లండన్‌లో. తెలుసా? మా గుత్తాలున్నాయి వాటిని స్కార్లెట్‌పింపర్నల్ గుత్తాలు అంటాం. మార్కెటుకుపో! స్కార్లెట్‌పింపర్నల్ మార్కు టోపీలు, చొక్కాలు ... ఒకటేమిటి అన్నీ అవే! మొన్ననే నేను ఒక కొత్తఫాషన్ గౌను కుట్టించాను బహుశా దానినికూడా స్కార్లెట్‌పింపర్నల్ ఫాషన్ అనే అంటారేమో?"

చిన్నపిల్లలాగా చిలిపిగానవ్వుతూ మార్గరెట్ వేళాకోళంగా మాట్లాడుతూంటే, షావలిన్ ఆమెమాటలకు అడ్డురాకుండా నిశ్శబ్దంగా నడుస్తున్నాడు. ఆమె చెప్పేదంతా అయినతరువాత షావలిన్ ఇలా అన్నాడు.

"సరే. ఇంకేం? స్కార్లెట్‌పింపర్నల్ సంగతి తెలుసునన్నమాట! ఆ పేరుతో మన మాతృభూమికి

వ్యతిరేకంగా పనిచేస్తున్న ఒకానొక ప్రబలశత్రువును గురించికూడా వినేఉంటావు. నేను ఫ్రెంచి ప్రభుత్వ రాయబారిగా ఇక్కడికివచ్చాను ఆహోదాలోనే రేపు బ్రిటిషు ప్రధానమంత్రిని కలుసుకొని అధికారపత్రాలు సమర్పించబోతున్నాను. అయితే ఇది పై మాటఅనుకో! ఆ పింపర్నల్ ఎవరో ఆచూకీ తీయటమే నా రహస్యవిధి. అందుకే నేనువచ్చాను."

"మంచిదే! అయితే నన్ను ఏమిచెయ్యమంటావు?"

"చెప్తున్నా. తొందరపడకు ఆపింపర్నల్ సహాయంతో తప్పించుకువస్తున్న ప్రభువంశీకులు, మనదేశంలో మనం జరుపుతున్న పవిత్ర ఉద్యమానికి వ్యతిరేకంగా ఇక్కడ ప్రచారంచేస్తారు. అందువలన మనకు ఎంతైనా ప్రమాదంఉన్నది. అందుచేత ముందు ఆ స్కార్లెట్ పింపర్నల్‌ను పట్టుకోవటం ఎంతో అవసరం ఆపని మరొకరివల్లకాదు. నీవే చెయ్యాలి. మనదేశమాతకోసం, నీవీపని చెయ్యకతప్పదు."

పావలిన్ ఉపన్యాసంఅంతా మార్గరెట్ సావధానంగా విన్నది. స్కార్లెట్ పింపర్నల్ అనే మారుపేరుతో ఈ అజ్ఞాత సాహసికుడు చేస్తున్న మహాత్కార్యాలు ఆమె ఇదివరకే చాలావిన్నది. పేరుకోసం ఆశపడకుండా, వ్యయప్రయాసలకోర్చి, ప్రాణాలను పందెంగాపెట్టి అతడు ఆడుతున్న ఈ ఆట, ఈ సత్కార్యం ఆమెకునచ్చింది. నిజంచెప్తే, ఫ్రాన్సులో సాగుతున్న విప్లవోద్యమంపట్ల ఆమెకు ఈషణ్మాత్రం సానుభూతిలేకుండాపోయింది. స్కార్లెట్ పింపర్నల్ గురించి తెలుసుకున్నకొద్దీ ఆమెకు అతనిపైగల అభిమానం ఇనుమడించింది.

పావలిన్ చెప్తున్న మాటలు వింటున్నమాటేకాని, మనస్సులో ఆ పింపర్నల్ ఎలాఉంటాడో, ఆ క్షణాన ఏంచేస్తుంటాడో అన్న ఊహాలు ఒకదానిపై ఒకటి వస్తున్నాయి.

పావలిన్ పిలుపుతో ఆమె మళ్లా ప్రపంచంలోకి వచ్చింది. అప్పటికే వారు ఫిషర్ మన్స్ రెస్ట్ దాపుకు వచ్చేశారు.

మనస్సు ఆలోచనలనుండి బయటపడగానే, ఆమెకు మొదటగా వినిపించింది—ఇంగ్లాండులోకల్లా పెద్ద ధనవంతుడు—మందమతిఅయిన సర్ పెర్సీ వెఱ్ఱి నవ్వు. మార్గరెట్ దీర్ఘంగా నిట్టూర్చింది. తన మనస్సు అభిమానాన్ని చూరగొన్న ఆ పింపర్నల్ - చూరగొనవలసిన సర్ పెర్సీ - ఎంత వ్యత్యాసం?

మనసులో ఆలోచనలేవీ బయటపడనీకుండా ఆమె నిర్లక్ష్యంగా చిరాకుగా అన్నది. "బాగుంది. అయితే ఆ పింపర్నల్ ఎక్కడఉన్నాడని వెతకమంటావు నన్ను?"

"నీకు ఇంగ్లాండులో అడ్డేముంది మార్గరెట్? నీవు తలుచుకుంటే ఏమిచెయ్యలేవు?"

"ఆకబుర్లన్నీ కట్టిపెట్టు. నేనేమీ స్వతంత్రురాలినికాను. భర్త, సంసారంకలదాన్ని. సరేగాని ఆ పింపర్నల్ ఎవరోతెలిస్తేమాత్రం నీవేమి చెయ్యగలవు? అతడు ఇంగ్లీషువాడు నీఅధికారం, శాసనాలు అతనికి వర్తించవు. తెలుసా?"

పావలిన్ కసిగా, వ్యంగ్యంగా ఇకిలించాడు. "నిజం నిజం. నాఅధికారం ఆ ఇంగ్లీషువాడిమీద ఇక్కడేమీ చెల్లదు. కాని ఆ ఇంగ్లీషువాడు ఫ్రాన్సురాడా? దొరకడా? ఆ శుభముహూర్తం, ఆ ఆనందసమయం, ఆ జాతీయపర్వదినం ఎప్పుడా అనే చూస్తున్నాను."

మార్గరెట్ అయిష్టంగా ముఖం చిట్లించింది. "అంత మరీ పరవశం కాబోకు. మీరే అంత మొనగాళ్లయి, అతనివంటిమీద చెయ్యివేస్తే, ఇంగ్లాండు ప్రజలు, ప్రభుత్వం చచ్చుదద్దమ్మలలాగా ఊరుకుంటారని నీఉద్దేశ్యమా?"

"అది ఒక లెక్కలోదికాదు మార్గరెట్! ముందు స్కార్లెట్ పింపర్నల్ తల ఎగిరిపోతుంది. ఆతరువాత అంతగా ముంచుకొస్తే ఫ్రెంచిప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి విచారం, క్షమార్పణ చెప్పుకుంటుంది. అదంతా నేను చూసుకుంటానులే కాని నీవు. ."

"పావలీన్! అంతకంటె దుర్మార్గం ఇంకొకటి లేదు. నేను నాచేతులతో అటువంటిపని చెయ్యలేను. ముమ్మాటికి చెప్తున్నాను. ఈ ఛండాలపుపనిలో నీకు సహాయంచెయ్యను, చెయ్యను, చెయ్యను."

మార్గరెట్ తనను, తన మాటను ఇంత తేలికగా కొట్టిపారేసినా పావలిన్ ఏమీ తొట్రుపడలేదు.

"పోనీలే! ఇంగ్లాండుకు పారిపోయివచ్చిన ప్రతిద్రోహి చేసేఅవమానం భరిస్తూ పడిఉండు."అన్నాడు వ్యంగ్యంగా.

మార్గరెట్ చిన్నబుచ్చుకున్నది. "నాసంగతి

# మనిషి-దెయ్యం

పూర్వం ఒక గ్రామంలో రామయ్య అనేవాడు ఉండేవాడు. అతనికి ఒక ముసలి తల్లి, భార్య, పదేళ్లది చిన్నారి కూతురు ఉన్నారు.

రామయ్యకు ఒకసారి తన ఇలవేలుపు అయిన భద్రాద్రిరాముని దర్శించి రావాలనిపించింది. తల్లితోను, భార్యతోను "జాగ్రత్తగా ఉండండి. తొందరగా వస్తానులే." అని చెప్పి రామయ్య భద్రాద్రి పోతున్న భక్తులతో కలిసి యాత్రకు బయలుదేరి వెళ్లాడు.

రామయ్య ఇంటి వెనుక ఒక దయ్యం ఉన్నది. రామయ్య తీర్థయాత్రలకు వెళ్లటం ఆ దయ్యం చూసింది.

ఆ దయ్యం మనస్సులో ఒక దురాలోచన పుట్టింది. వెంటనే అది రామయ్య ఆకారం దాల్చింది. దయ్యం అచ్చంగా రామయ్య మల్లేనే ఉన్నది.

ఆనాటి రాత్రి చీకటి బాగా దట్టంగా ఉన్నది. రామయ్య ఆకారంలో ఉన్న దయ్యం ఇంటికి వెళ్ళి తలుపుతట్టింది. రామయ్య భార్య తలుపుతీసి తనభర్త తిరిగిరావటం చూసి ఆశ్చర్యపోయింది. "మీరు

## చావలి జయలక్ష్మి

భద్రాద్రి వెళ్లలేదేం?" అని ప్రశ్నించింది.

"భద్రాద్రి వెళ్లేదారిలో దొంగలబాధ విపరీతంగా ఉన్నదిట. అందరమూ కలిసిఉంటే భయం లేదు కాని తక్కినవారు సరాసరి భద్రాద్రివెళ్లటం మానేశారు. ఇంకా తక్కిన పుణ్యక్షేత్రాలు కూడా సందర్శించి, ఆ తరువాత భద్రాద్రి వెళ్తారుట. ఎంతకాలం పడుతుందో ఏమోనని నేను తిరిగి వచ్చేశాను. మనకు రాసిపెట్టిఉంటే మరెప్పుడయినా ఆ రామయ్య తండ్రి దర్శనం చేసుకుంటాను" అన్నది దయ్యం.

రామయ్య తల్లి, భార్య ఆ మాటలు నమ్మారు. ఆ దయ్యం ఇంట బయటా రామయ్యగా చలామణీ అవుతున్నది. ఎవరికీ ఏ అనుమానం తగలలేదు.

సంవత్సరం గిర్రున తిరిగివచ్చింది. భద్రాద్రి వెళ్లిన రామయ్య అక్కడి నుండి ఇంకా కొన్ని తీర్థాలుకూడా సేవించి ఇంటికిచేరుకున్నాడు. "తల్లి భార్య, కూతురు ఎట్లా ఉన్నారో" అనుకుంటూ రామయ్య ఇంటి గుమ్మంలో కాలుపెట్టాడు.

ఇంతలో రామయ్య వేషంలో ఉన్న ఆ దయ్యం అక్కడికి వచ్చి, "ఎవరు నువ్వు? నీకేం కావాలి?"అని

---

 స్కార్లెట్ పింపర్నల్ 

నేను చూసుకుంటానులే. నీసలహా అక్కర్లేదు. కాని నామీద ఏమీఆశపెట్టుకోవద్దు నువ్వు—నీఫ్రాన్సు దేశము." అంటూ వెనుకకు తిరిగిచూడకుండా మార్గరెట్ హోటలు తలుపు దగ్గరదాకాపోయింది.

షావలిన్ అక్కడే నిలబడి "తొందరపడినిశ్చయం చెయ్యకు. మళ్లానేను లండన్‌లో కనిపిస్తాను"అన్నాడు.

"లండన్‌లో కాకపోతే మరోగిండన్‌లో కనబడు. కాని ఈవిషయంమాత్రం ఇంతే. ఇంకొకమాటలేదు."

అని బదులుచెప్పి మార్గరెట్ లోపలకువెళ్లిపోయింది.

తాను అనుకున్నపని ఇలా ఎదురుతిరిగినా షావలిన్ కొంచెంకూడా నిరుత్సాహపడలేదు. మార్గరెట్ తనను నిరసించి, 'ఛీ' అన్నంతపని చేసినా చిన్నబుచ్చుకోలేదు. తాపీగానిలబడి, చేతులు నలుపుకొని, నస్యం ఒక్కపట్టు నా సికాపుటాలలోకి ఎక్కించి సంతృప్తిగా ఇకిలించుకుంటూ వెళ్లిపోయినాడు.

(ఇంకా ఉంది)

అడిగింది. ఇది విన్న రామయ్యకి బలే కోపంవచ్చింది "నాకేం కావాలా? ఛేష్! ఛేష్!!" అని అరిచాడు. "ఇది నా యిల్లు—నేను యాత్రలకివెళ్ళి తిరిగివచ్చాను. నేనీ యింటికి యజమానిని—తెలుసా? నువ్వు ఎవరు? ఇక్కడ ఎందుకున్నావ్? నీ కిక్కడేంపని?" అన్నాడు రామయ్య కోపంతో. దయ్యం వికటంగా నవ్వి, "హోహో! బలేవాడివే! ఇది నా యిల్లు. ఈవిడ నా తల్లి. ఇది నా భార్య. ఇది నాకూతురు. నువ్వెవరవో మోసకారివి. ఛోఛో! తక్షణం బయటికి నడు!" అన్నది నిర్లక్ష్యంగా. రామయ్య గత్యంతరంలేక బయటికి వచ్చేశాడు.

రామయ్య గ్రామాధికారివద్దకు వెళ్ళి, జరిగినవృత్తాంతమంతా ఆయనకు విన్నవించి, తనకు న్యాయం కలుగజేయవలసిందిగా కోరాడు. గ్రామాధికారి ఆ దయ్యాన్నికూడా పిలిపించాడు.

ఈ యిద్దరు మనుష్యుల్లో ఎవరు నిజమైన రామయ్యో? ఇద్దరూ ఒకే విధంగా కనబడుతున్నారు; ఒకే విధంగా మాట్లాడుతున్నారు, ఒకే విధంగా ప్రవర్తిస్తున్నారు. వాళ్లని పరిశీలించి పరిశీలించి ఆ గ్రామాధికారి విసుగెత్తిపోయినాడు. "అయ్యా, నేను నిజమైన రామయ్యనండి. ఆ యిల్లు నాదేనండి ఈ మనిషి మోసకారి అండీ!" అని యిద్దరూ చెపుతున్నారు. ఇక ఎట్లా తీర్పుచెప్పటం? వీళ్లిద్దరిలో నిజమైనరామయ్య ఎవరు? ఎంత ఆలోచించినా, ఆ గ్రామాధికారికి ఏమీ తోచింది కాదు. ఏరోజు కారోజు "రేపు తీర్పు చెపుతాను" అని వాయిదా వేస్తున్నాడు.

ప్రతిరోజూ నిజమైన రామయ్య ఆ గ్రామాధికారి వద్దకు వస్తున్నాడు. నిరాశతో, నిస్పృహతో తిరిగి వెళ్లిపోతున్నాడు. ఒకనాడు ఒక ముసలిగొల్లవాడు "రామయ్యా! నీకు తీర్పుచెప్పారా?" అని అడిగాడు. "లేదయ్యా, ఇంకా యేం చెప్పలేదు." అని జవాబిచ్చాడు రామయ్య విచారంతో.

"మరే, మా గొల్లవాళ్ళ పిల్లవాడు ఒకడున్నాడు. వాడిపేరు గోపన్న. వాడు ఈ చిక్కుసమస్య విడదీయగలడు. గ్రామాధికారితో

# ★ మనిషి - దయ్యం ★

చెప్పు. ఆయన ఒప్పుకుంటే, రేపు వాడు అక్కడికి వస్తాడు" అన్నాడా ముసలిగొల్లవాడు." అట్లా అయితే, గ్రామాధికారితో చెపుతాను" అన్నాడు రామయ్య.

మరునాడు గ్రామాధికారి గోవన్నని పిలిపించాడు. "అయ్యా, నేను తీర్పు చెప్పగలను. కాని నాకు మీరు కొంత సహాయపడాలి. బోలుగా ఉన్న ఒక చిన్న వెదురుకర్ర, మూడు వీశల మైనమూ నాకు మీరు దయచేసి యిప్పించండి.' అన్నాడు గోవన్న వినయంగా చేతులు కట్టుకుని నిలబడి. గ్రామాధికారి గోవన్నకు కావలసిన మైనమూ, వెదురు కర్రా, యిప్పించాడు.



బహూనందు!

—ఫొటో: డి. వెంకటేశ్వరరావు, ఏలూరు.

గోవన్న రామయ్యనీ, దయ్యాన్నీ పరీక్షగా తేరిపార చూశాడు. "మీ యిద్దరిలో నిజమైన రామయ్య ఎవరో నిర్ణయించటం చాలా కష్టం. కాని మీలో ఎవరో ఒకరు మోసకారి అయి ఉండాలి. సరే, నేనొక చిన్న పరీక్ష పెడతాను. దానితో ఎవడు నిజమైన వాడో తేలిపోతుంది." అన్నాడు.

రామయ్యవైపు తిరిగి "నువ్వు ఈ వెదురు బొంగులో దూరగలవా?" అని అడిగాడు గోవన్న. "నీకేమైనా పిచ్చి ఎక్కిందా ఏమిటి? నేనా చిన్న బొంగులో ఎట్లా దూరగలను?" అని కోపంగా అరిచాడు రామయ్య.

గోవన్న దయ్యంవేపు తిరిగి, "సరే, ఎవడు నిజమైన రామయ్య అయితే, వాడే ఈ వెదురుబొంగులో దూరగలడు. కాబట్టి నీవు దాంట్లో, దూరగలవేమో చెప్పు!" అన్నాడు. "నేను దూరగలను" అన్నదది దయ్యం. "సరే, కాని" అన్నాడు గోవన్న, మానవాకారంలో ఉన్న దయ్యం నిమిషంలో సన్నగా పొగగా మారిపోయి, మెల్లగా వెదురుబొంగులో దూరింది. వెంటనే గోవన్న వెదురు బొంగు రెండు చివరల్లోనూ బాగా మైనం దట్టించి, రెండు వేపులా గట్టిగా మూసివేశాడు. "ఎవరైనా ఈ వెదురుకర్రను తీసికెళ్ళి సముద్రంలో పారవేయండి. ఇక ఈ విధవదయ్యం పీడ వదిలిపోతుంది" అన్నాడు గోవన్న విజయోత్సాహంతో. అక్కడున్న వారంతా ఆశ్చర్యపోయినారు. దయ్యానికి తగిన శాస్తి జరిగినందుకు సంతోషించారు. రామయ్య సంతోషంగా ఇంటికి వెళ్లాడు. ★

# గోపాలం పాల కొలత

గోపాలం అమ్మగారు నాలుగు సేర్ల పాలు తెచ్చిపెట్టమని గొల్లదానికి కబురు చేశారు. గొల్లది ఎనిమిది సేర్లుపట్టే ఒక పాత్రనిండ పాలు తెచ్చింది. సేరు కొలపాత్ర మరిచిపోయింది. ఆ ఎనిమిది సేర్ల పాలనుండి నాల్గు సేర్లుతీయటం ఎలాగో కుదరలేదు. అయితే గోపాలం అమ్మగారూ వేరే రెండు పాత్రలు ఇంట్లో ఉంటే తెచ్చారు. అందులో పెద్దది అయిదుసేర్లు పడుతుంది, చిన్నదేమో మూడు సేర్లు పడుతుంది. ఇంతలో గోపాలం అక్కడికి వచ్చాడు



సంగతి, సందర్భాలు అడిగి తెలుసుకున్నాడు.

"ఇదుగో చూడండి. ఈ మూడు పాత్రలతోనే, మరొక పాత్ర అక్కరలేకుండా నాలుగు సేర్ల పాలు కరెక్టుగా కొలిచి యిస్తాను" అన్నాడు గోపాలం.

గోపాలం ఏమిచేస్తాడా అని యిద్దరూ ఆశ్చర్యపోయి చూస్తున్నారు. దీనిలో పాలు దానిలో, దానిలోపాలు దీనిలో పోస్తూ ఏమేమిటో కొలిచాడు. చివరికి నాలుగుసేర్ల పాలు కరెక్టుగాతీసి, అయిదుసేర్లు పట్టే పాత్రలోపోసి, అమ్మ చేతికి ఇచ్చాడు.

గోపాలం ఎలా కనుక్కున్నాడో ఆకొలత ఏమిటో మీరుకనిపెట్టండి చూద్దాం! లేకపోతే వచ్చేవారం దాకా ఆగండి. గోపాలాన్నే అడుగుదాం.

# గడియారం గంటలు

"ఏమిరా చందూ! తెలిసిందా? లేదా?"



"తెలియలేదు అక్కయ్యా!"

"విను గడియారం ఆరుగంటలు కొట్టిందా? అలా కొట్టటానికి ఎంత సేపు పట్టింది?"

"ముప్ఫై సెకండ్లు."

"ఒకగంట కొట్టటానికి మరొక గంట కొట్టటానికి మధ్యకాలం ఎంత పట్టింది?"

"ముప్ఫైని ఆరుపెట్టి భాగిస్తే అయిదు. అయిదుసెకండ్లుపట్టింది."

"ఆహాహా! ఏం తెలివి? ఆరుపెట్టి ఎందుకుభాగించాలి? మొదటి గంటకి రెండవగంటకి మధ్యఉండే కాలం కొంత పట్టిందనుకో. అటువంటి మధ్యకాలాలుఎన్ని?

మొదటిగంటకి, రెండవగంటకి మధ్యఒకటి, రెండవదానికి మూడవదానికి మధ్య రెండు మూడుగంటలు కొడితే మధ్య కాలాలు రెండు ఉన్నాయి. అలాగ నాలుగు గంటలయితే మూడు మధ్యకాలాలు. ఆరయితేనో...?"

"అయిదు."

"అప్పుడు ఆ మధ్యకాలం ఎంతవుతుంది? ముప్ఫైని అయిదుతో భాగిస్తే, ఆరు సెకండ్లు."

"అవునా? మరి పన్నెండు గంటలుకొడితే ఎన్ని మధ్యకాలాలుంటాయి?"

"పదకొండు.. ఆఁ! తెలిసింది. పదకొండుఆర్లు అరవైఆరు సెకండ్లు పడుతుంది అంతేకదు అక్కయ్యా?"

"ఇంకా అనుమానమే? కనుక్కున్నావులే ఎలాగైతేనేం!"



# అల్లరి పిల్లలు

## 4. గొప్పలు చెప్పుకునే రాణి

"నాకు ఉన్నన్ని మంచి జాకెట్లు, పరికిణీలు, మా క్లాసులో ఎవ్వరికీ లేవు తెలుసా?"

"నానంటే మా టీచరుకి ఎంతో ఇష్టం. తక్కిన వాళ్లందరికంటె నన్ను ఎక్కువగా చూస్తుంది. ఏమనుకున్నావో!"

"నాకు ఎన్నో మంచిబొమ్మలున్నాయి. నేను ఎప్పుడు ఏది కావాలంటే అది కొనిఇస్తారు. నేను తెలివైనదానినని మా నాన్నగారికి నేనంటే ఎంతో ముద్దు."

రాణీతో ఎంత సేపయినా మాట్లాడు - ఇదేధోరణి. అన్ని విషయాలలోను తానే అందరి కంటె గొప్పయిపోయినట్లు ఎప్పుడూ గొప్పలు చెప్పుకుంటూ ఉంటుంది. అందుకనే రాణీతో సావాసంచెయ్యాలన్నా, మాట్లాడాలన్నా అందరికీ అసహ్యం.

ఒకనాడు రాణీ క్లాసులోనే చదువుతున్న కమల సిల్కుపరికిణీ కట్టుకువచ్చింది. కమల చాలా మంచి పిల్ల. నలుగురూ కమల దగ్గిరికి వెళ్ళి, "పరికిణీ చాలా బాగుందే!" అని మెచ్చుకున్నారు. ఇదిచూసి రాణీ ఓర్చలేకపోయింది. "పెద్ద! మహా ఒకనాడు సిల్కుపరికిణీకట్టుకు వచ్చిందిలెద్దూ. నాకుమంచి పట్టు పరికిణీలు నాలుగున్నాయి. ఈసిల్కు దానిముందు ఎందుకు పనికివస్తుంది?" అని ఈసడించింది. పాపం! కమల చిన్నబోయింది. ఇదంతాచూస్తున్న పద్మ రాణీ దగ్గరికివచ్చి "అట్లా అనచ్చునటే తప్పుకదూ?" అనిఇంకా ఏదో చెప్పబోతుంటే, రాణీ మూతి ముడుచుకొని వినకుండా వెళ్లిపోయింది. రాణీ అన్న మాటలు బాగుండలేదని, అది మంచిది కాదని, దానితో ఎవ్వరూ మాట్లాడకూడదని క్లాసులోవాళ్లందరూ అనుకున్నారు.

ఆనాడు రాత్రి రాణీకి ఒక తమాషా కలవచ్చింది. ఆకలలో ఒక వింత మరుగుజ్జుమనిషి కనిపించాడు. అతడు పసుపుపచ్చరంగుగా ఉన్నాడు. నెత్తిన ఆకుపచ్చటిటోపీ పెట్టుకున్నాడు. నీలిరంగు గుడ్డలు వేసుకున్నాడు. పొడుగైన గడ్డం ఉన్నది. ఆగడ్డం రాగిరంగుగా ఉన్నది. అతన్ని చూడగానే రాణీ ఫక్కున నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగాడు అతడు.

"ఏమీలేదు. నిన్ను చూస్తేనే నవ్వువచ్చింది." అన్నది రాణీ.

వెంటనే ఆ మరుగుజ్జు పకపక నవ్వటం మొదలుపెట్టాడు.

"నువ్వెందుకు నవ్వుతున్నావు?" అని అడిగింది రాణీ.

"నిన్ను చూస్తే నాకు నవ్వు వస్తున్నది"

"ఏం? ఎందు చేత?

"ఎందుకా? పొద్దున నువ్వు చేసినపనికి."

"ఏంచేశాను?"

"కమల సిల్కుపరికిణీ కట్టుకొస్తే, నీవొక్కదానివే గొప్పదానివైనట్లు, నాలుగు పట్టుపరికిణీలున్నాయని గొప్పలు చెప్పుకుంటివే!"

"గొప్పేముంది. లేవాయేమిటి? మా అమ్మ బీరువాలోదాచింది."

"నిజగాం? నాలుగున్నాయా?"

"నాలుగు లేకపోతే మాత్రం రెండు లేవాయేమిటి?"

"మరినాలుగని ఎందుకుగొప్పలు చెప్పుకున్నావు?"

రాణీ మాట్లాడలేదు.

"అలా గొప్పలు చెప్పుకోకు ఎప్పుడూ. సరేగాని మా అబ్బాయి ఒకడున్నాడు: నీకుమల్లేనే గొప్పలు చెప్తాడు. చూపిస్తాను. వస్తావా?"

"ఎక్కడికిపోవాలి? అమ్మో నేను రాను. నాకుభయం."

"ఎక్కడికో కాదులే. మా పెరడు లోనే." అని అంటూ ఆ మరుగుజ్జు రాణిచెయ్యిపట్టుకొని తీసుకుపోయినాడు. ఇద్దరూ అలా పెరడులోకి వెళ్లారు. అక్కడ ఒక పెద్ద వేప చెట్టుఉన్నది. ఆ మరుగుజ్జు ఆ చెట్టుకు ఒక ప్రక్కన ఒక మీట లాగా నొక్కి తలుపు తెరిచాడు. ఆశ్చర్యం! ఆ చెట్టుకి మీటఉన్నదని, తలుపు తెరవవచ్చునని, ఆ చెట్టు మొదటిలో దారిఉన్నదని రాణికి ఎప్పుడూ తెలియనే తెలియదు.

అలా వెళ్లి వాళ్లిద్దరూ ఒక యిల్లు చేరుకున్నారు. అక్కడ వాళ్లకి ఒకఅబ్బాయి కనిపించాడు. వాడు నుంచున్న చోట కూర్చోక, కూర్చున్న చోట నిలబడక, గంతులు వేస్తున్నాడు. "ఈ అమ్మాయేనా, నాన్నా! నాకు చెప్పింది?" అని అడిగాడు.

"అవును"న్నాడు మరుగుజ్జు.

"నీవు మీ క్లాసులో అందరి కంటె ఎక్కువ తెలివిగలదానివిట. నిజమేనా?" అని అడిగాడు వాడు.

"ఎవరు చెప్పారు?" అన్నది రాణి.

"నువ్వే చెప్పుకుంటున్నావుగా! మీ టీచరు నిన్ను ఎక్కువగా చూస్తుందని కూడా చెప్పుతున్నావు కదూ!"

"నేనేం అబద్ధం చెప్పానా? నిజం కాబట్టే అన్నాను"

"అవును లే! అబద్ధమని నేను మాత్రం అన్నానుగనుకనా? ఊరికే అడిగాను. అయితే నీకు దేంట్లో ఫస్టుమార్కు వచ్చింది. చెప్పు"

"లెక్కలు .ఒక్క లెక్క లేమిటి? ఇంకా చాలావాటిల్లో వచ్చింది.

"సరే అయితే ఈ లెక్క చెప్పు చూద్దాం. 47 ని 59 పెట్టి గుణిస్తే ఎంత వస్తుంది?"

"బాగుంది. ఎవరైనా ఇలాంటి లెక్క నోటితో చెప్పగలరా? కాగితంమీద అయితే వేసి చెప్తాను."

"ఇంతేనా నీ తెలివి! రెండు వేల ఏడువందల డెబ్బైమూడు."

"నువ్వు ముందుగా వేసి పెట్టుకున్నావు."

"పోనీ, ఇంకోటి నువ్వు అడుగు."

రాణికి కచ్చ వేసింది అందుకని వాడు చెప్పలేని పెద్ద లెక్క అడగాలనుకున్నది. "నాలుగు వేల మూడు వందల తొంభైయారును ఏడువందల యాభైమూడు పెట్టి హెచ్చవేస్తే ఎంత వస్తుంది?" అని అడిగింది.

వాడు తడుముకోకుండా "ముప్పైమూడులక్షల, పది వేల నూటఎనభైఎనిమిది" అని చెప్పేశాడు. రాణికి నమ్మకంలేక కాగితం అడిగితీసుకొని వేసి చూసింది. సరిపోయింది.

వాడు గంతులువేస్తూ పకపక నవ్వుతూ "ఇంతేనా నీ తెలివి? ఇంతోసిదానికేనా ఇంతగొప్పలు చెప్పుకుంటున్నావు!" అని గేలి చేశాడు. రాణి ఏడుపు మొహం పెట్టింది.

వాడు అక్కడితో ఊరుకోక "సరేగాని నీకు పట్టు పరికిణీలు "నాలుగున్నాయిటగా!" అన్నాడు.

రాణి ఉక్రోషం పట్టలేక "నాలుగుకాదు ఎనిమిది ఉన్నాయి." అన్నది. వాడు పళ్లు యికిలించి "ఎనిమిదిఉన్నాయా? మీ యింటికి వస్తానుగాని చూపిస్తావా?" అన్నాడు. రాణి బిక్కమొహంతో "ఇప్పుడుగాదు. రేపురా చూపిస్తా" అని చెప్పింది. "ఏం? ఈ లోగా కుట్టించుకుంటావా? అయితే మానెలె. నాకు ఎన్ని సిల్కు చొక్కాలున్నాయో తెలుసా? నాలుగ్గు, ఎనిమిది కాదు నాలు గెని ముదులు ముప్పయి రెండు. నీకు మల్లే కాదు. నేను ఇప్పుడే చూపిస్తానురా!" అని అంటూ వాడు పెట్టెతీసి చూడమన్నాడు. ఎలాగైనా వాణ్ణి ఏడిపించాలని రాణి జాగ్రత్తగా లెక్క పెట్టింది. అందులో ముప్ఫయి మూడు చొక్కాలున్నాయి. వాడు నవ్వుతూ "ఓశ్ అదా! అది కొసరు చొక్కాలే! అందుకని లెక్కలో వెయ్యలేదు." అన్నాడు.

"ఇంటికి వెళ్లి, నేనూ కుట్టించుకుంటాను నలభైతొమ్మిది." అన్నది రాణి.

"గొప్పదానివేలే! కుట్టించమని అమ్మనీ నాన్నని ఏడిపిస్తావా? నేను ఎప్పుడూ అలా చెయ్యను. కావాలంటేచూడు. మళ్ళీ మాట్లాడితే నాకు 64 చొక్కాలున్నాయి."

"ఏవి?"

"అందులోనే ఉన్నాయి చూడు." అన్నాడు వాడు

రాణి ఓపికగా మళ్ళీ లెక్క పెట్టింది. ఈసారిఅందులో అరవై నాలుగు ఉన్నాయి. ఓడిపోయిన దానిలాగా మొహం పెట్టి రాణి "నువ్వేదోమాయ చేస్తున్నావు. నాకు మాయలెవ్వీ తెలియవు గనుక అన్యాయం చేస్తున్నావు." అన్నది

అంతదాకా ఇదంతా చూస్తూ నిలబడ్డ మరుగుజ్జు అన్నాడు. "ఓ పిచ్చి అమ్మాయీ! మాయో, మానమో అటుంచు. నీకన్న గొప్పవాళ్లింకా ఉన్నారని ఇప్పటికైనా తెలిసిందా లేదా?"

"ఉండవచ్చు మా క్లాసులో నేను గొప్పదాన్ని కనుక నేను

#  అల్లరిపిల్లలు 

చెప్పుకున్నాను. అందులో తప్పేమిటి?"

"చెప్పనా? నీకంటె మావాడు గొప్పవాడుకదా! వాడు తన గొప్పతనం చూపిస్తుంటే నీకెలాఉన్నది? తక్కువయిపోయినానని ఏడుపు వచ్చిందాలేదా?"

"నేనేమీ ఏడవటంలేదు."

"అలా అనకు పోనీ మనస్సుకు కష్టంగాఉన్నదాలేదా? అలాగే నీవు ఊరికే గొప్పలు చెప్పుకొని తక్కినవాళ్ళని తక్కువగా చూస్తూ ఉంటే వాళ్ల మనస్సుకు కష్టంగా ఉంటుందా ఉండదా?"

రాణీకి ఇప్పుడర్థమైంది ప్రొద్దుట కమల ఎంత బాధపడిఉంటుందో. కళ్ల వెంబడి నీళ్లుతిరిగాయి. అనలేక, అనలేక "నిజమే" అంటూ తల ఊపింది అప్పుడు ఆ మరుగుజ్జు చిరునవ్వు నవ్వుతూ, "నువ్వు నిజంగా మంచిదానివేనమ్మా రాణీ! కాని ఎప్పుడూ తక్కిన వాళ్ళతో కలిసి తిరుగుతూ, వాళ్లతోనూ మంచిగా ఉండాలి" అనిచెప్పి మాయమైనాడు. వాళ్ల అబ్బాయి కూడా నవ్వుతూ కేరింతలు కొడుతూ మాయమై పోయినాడు. రాణీకి అక్కడినుంచి ఇంటికి ఎలా వెళ్లటమా అని భయంవేసింది. కాని కళ్లు తెరిచిచూస్తే తన పక్కమీదే ఉన్నది.

ప్రొద్దున్నే లేవగానే రాణీ గబగబ వేపచెట్టు దగ్గరికివెళ్లి రాత్రి కనిపించినమీాట ఉన్నదేమోనని వెతికింది కాని ఏమీా కనిపించలేదు.

ఆ నాడు బడికివెళ్లగానే రాణీ కమలవద్దకివెళ్లి క్షమించమని బ్రతిమిలాడింది. రాణీ అలా మారిపోయినందుకు అంతా ఆశ్చర్యపోయినారు. సంతోషపడ్డారు. మళ్లీ ఎప్పుడూ రాణీ గొప్పలు చెప్పుకోలేదు.

—ము వీ



#  కోటమ్మ గెలిచిన 'లాటరీ 

(10 వ పేజీ తరువాయి)

ఆమె ఆమె దృష్టిలో యీారోజున వీరంతా తన కాలిగోటికి పోలని అల్పులు. వాళ్ళ మాటలు ఖాతరుచేసి మనస్సు పాడుచేసుకోటానికి ఆమెకు అవుసరమూ లేగు తీరికాలేదు.

కోటమ్మ తనకు రాబోయే డబ్బుతో యేమి చేయాలా అని ఆలోచింసుకుంటూవుండగానే హాటుధరించిన వొక సూటువాలా నీటుగా వాకిటిముందు ప్రత్యక్షమయి

"కోటమ్మగారి యిల్లు యిదేనా" అని అడిగాడు.

కోటమ్మ తత్తరబి త్తరపడి నిలుచుంది

"ఏం బాబూ యేమి పనిమీాద వచ్చారూ" అని యెంతో మర్యాదతో పలకరించింది.

"కోటమ్మగారంటే మీారేనా"

"నేనేను—ఆ కోటమ్మని యేమి పనీ నాతో."

"మీాకు పజిలులో ప్రయిజు వచ్చింది గదా. ఆ కంపెనీ తరఫు మనిషిని" అన్నాడు ఆ సూటువాలా

"ఆ మా తండ్రే—రా నాయనా రా... అయ్యో నా తెలివి తెల్లారినట్టేవుంది పెద్ద మనిషి యింటికి వస్తే నిలబెట్టే మర్యాద చేస్తున్నాను - కూర్చో బాబూ కూర్చో" అంది కోటమ్మ ఒక చాపపీలిక అరుగుమీాద పారేసి

ఆ సూటువాలా చతికిలపడి హాటు తీస్తూ అన్నాడు

"పది రోజుల్లో మీాకు డబ్బు వస్తుంది"

"అల్లాగా నాయనా—అంతా నీ దయ"

"బామ్మగారూ మీారు మరోలా అనుకోకపోతే రెండు మూడు మాటలు మీాతో చెప్పిపోదామని వచ్చాను."

"అయ్యో నా తండ్రీ నాకు కొడుకులాటివాడివి. చెప్పు నాయనా చెప్పు" అన్నది కోటమ్మ ఆప్యాయత వలకపోసుకుంటూ

"ప్రశ్న లేదు. ఈ బహుమతులు యిచ్చే ముందు మా కంపెనీవాళ్లు బహుమతిదార్లను గురించీ వాళ్ల అభిప్రాయాల్ని గురించీ పేపర్లలో అచ్చు వేయిస్తారు ఫోటోతో సహా ఆ వివరాలు తెలుసుకుపోదామని వచ్చాను' అన్నాడు ఆ సూటువాలా పెన్ను మూత తెరుస్తూ

"అడుగు బాబూ. మరయితే నాకు యేమి చెప్పాలో తెలియదే"

"ఏమి లేదు బామ్మగారూ మీారేమో పూర్వకాలంవారు. ఎంతవరకూ చదువుకున్నారు?"

"చదువుకోలేదే నా తండ్రే పొలం వ్యవహారాలు చూసుకోవాలిగదా అని ఆ మారాజు దాటిపోయింతరువాత సంతకం పెట్టటం మాత్రం నేర్చుకున్నాను తెలుగు పుస్తకాలైతే ధాటిగా చదవగలను మరిపోతే చెప్పుకుంటే అతిశయం అంటారు గాని - అయినా నీదగ్గిర దాపరికం లేనికితే బాబూ లంకాయాగం, సీతసమర్త, లక్షణస్వామి నిద్ర, లక్షణదేవర నవ్వు యివన్నీ తడుముకోకుండా పాడగలను బాబూ" అన్నది కోటమ్మ

ఆ సూటువాలా నిండా ఆశ్చర్యపోయాడు. ఇటువంటి కోటమ్మకు ఆమయింటెలిజెంట్ లెన్వర్డ్ కాంపిటేషన్లో ఫస్టుప్రయిజు!

"మీాకు యింగ్లీషు రాదుగదా మా కంపెనీ సమస్యలు ఎవరు చెప్పారు మీాకు?" అని అడిగాడు అతగాడు

"ఒకళ్లు చెప్పాలా నాయనా ఒకటో రెండో వేయటానికి. సూర్యనారాయణమూర్తి తండ్రి మొహంచూసి ఏది వెయ్యాలి అని బుద్ధిపుడితే అది వేశాను" అన్నది కోటమ్మ

మహాభారత యుద్ధంలో అర్జునుడు కేవలం నిమిత్తమాత్రుడేనట. ముందు రథంమీాద కూర్చున్న కృష్ణస్వామివారే శత్రునాశనం చేశారుట ఇది గీతావాక్యం అల్లాగా ద్వాపరం తరువాత వచ్చిన యీా పచ్చి కలికాలంలోకూడా కోటమ్మ కేవలం నిమిత్తమాత్రంగా నిలబడింది!

"ఏమి ఏమి అదృష్టం - అయితే యీావరలో ఎప్పుడైనా మా పజిలుకు కట్టారా మీారు"

"అప్పే లేదే యిదే తొలిసారి బాబు"
అన్నది కోటమ్మ

"హా తొలిసారిలో నే తొలిప్రయిజా!"

ఎందరో మహానుభావులు అకన్నఫర్డ్, భాంబర్సు డిక్షనరీలు తిరగేసి తలలు బద్దలు కొట్టుకొని కూడా కడతేరలేని పరిస్థితుల్లో యీా తలచెడ్డ ముసలవ్వ యింత సొమ్ము యిట్టే సంపాదించటం అతగాడికి అమితమైన ఆశ్చర్యం కలిగించింది.

"అవుతే బామ్మగారూ తెలియక అడుగు

తాను - మొత్తం ఎంత డబ్బు కట్టారు మీరు"

"అంతా ఆరురూపాయలు అవుతుంది" అన్నది కోటమ్మ వేళ్ళమీద గుణించుకొని

"మీదగ్గిర - అహాఁ మరేవీ లేదూ - మీరు నిలవలోనే వున్నారనుకుంటాను" అన్నాడు ఆ పెద్దమనిషి మాటల్లో తడబడుతూ.

అయితే యిక్కడే పప్పులో కాలు వేసింది కోటమ్మ కొన్ని పొరపాట్లు మనం లోపంవల్ల చేసేవేకాక భగవత్ప్రేరణమీద జరిగేవికూడా వుండటం కద్దు. కుంభకర్ణుడు ఘోరమైన తపస్సు చేసినా, బ్రహ్మదేముడు ప్రత్యక్షంకాగానే "నిర్దయ" అని కోరుకోటానికి బదులు పొరపాటున "నిద్ర" అని కోరుకొని తన తపఃఫలం తభావతు చేసుకున్నాడనే పురాణగాధ మనకు తెలిసిందేగదా. అదేతీరుగా - కోటమ్మ నిజానికి యెంతో జాగ్రత్తపడే మనిషి అయినప్పటికీ కర్మఅల్లా తోసుకురాబట్టి అన్నది

"యేవో నాయనా - ఏ ఆమారాజు సంపాదించిపోయాడు-ఎటొచ్చీ నేను హరీ అన్న తరువాత కాకులకీ గద్దలకీ పెట్టేకేకదా"

"అయితే యీసొమ్మ యేవిచేస్తారూ"

కోటమ్మ కులాసాగా నవ్వింది -

"ఇదమిత్థమని యింకా తేల్చుకోలేదు బాబూ - కాశీ, బ్రహ్మకపాళం ఒకసారి చూసిరావాలని యెప్పట్నుంచో ఆశవున్నది. మా తమ్ముడు కూతురొకతె గజ్జలగుఱ్ఱంలా పెళ్ళికి ఎదిగి కూర్చుంది. అయినా వెధవలకు యిచ్చే హారాయించుకుపోదూ."

"ఇదుగో బామ్మగారూ . . పెద్దవారు మిమ్మల్ని చాలా కష్టపెట్టాను మీరు చెప్పిన విషయాలన్నీ యీ కాయితంమీద రాసుకున్నాను ఒక్కసంతకం కనక గీసిపారేశారా మీపేరు పేపర్లో పడటమూ... మీడబ్బుమీ గుమ్మందగ్గిరికి రావటమూ ఒక్కసారే జరుగుతాయి' అన్నాడు సూటువాలా లేచి నిలబడి

దౌర్భాగ్యురాలు కోటమ్మ కలం గ్రహించింది సంతకం చేసేనిమిత్తం -

ఇది జరిగిన వారంరోజులికి కోటమ్మ ఫొటో పేపర్లో పడ్డది.

ఆ ఫొటో దిగువను "ముసలమ్మ యిచ్చే సలహా" అనే ముచ్చటైన హెడ్డింగుతో ఆ పత్రికలోపడ్డ విషయం క్లుప్తంగా వ్రాయాలంటే యిల్లావుంది.

"పజిలు కంపెనీలు యింత నమ్మకంగా వుంటాయని నేను కలలోకూడా అనుకోలేదు" - అని దర్శిలా నాగాయలంక గ్రామంలోని ముసలమ్మ కోటమ్మగారు మా ఏజెంటుతో యింకా యిల్లా అన్నది -

"ప్రభుత్వం యీ పజిల్సును నిషేధించటానికి పూనుకుంటోందన్న విషయం మీరు చెప్పగా విని నేను చాలా బాధపడ్డాను. మంత్రాంగంలో మోసం కృత్రిమమూ వుండవచ్చుగాక - కాని అదే యితరులలో కూడా వుందనుకోటం నాగరికప్రపంచానికే సిగ్గుచేటు"

తరువాత అనేక వ్యక్తిగత విషయాలు మాట్లాడి కోటమ్మగారు కాంపటీటర్లకొక దక్కటి సలహా యిచ్చారు

"పోటీగాళ్లకు సలహా యిమ్మన్నారు - ఏవి సలహాయివ్వను - పట్టుదల, ఓపిక, విదతుణా జ్ఞానం యివన్నీ సమన్వయించుకొని సమస్యలు పూరించండి అపజయం కలిగినా విచారపడకండి నాకు తెలిసిన పదిమంది సలహాపొంది యింగ్లీషు సమస్యలు తెలుగు చేసుకొని తెలివితేటలతో సమస్యలు పూరించాను. మీరూ అదృష్టవంతులేనేమో ప్రయత్నించి చూడండి

* * *

లక్ష్మినారాయణ దావా దాఖలుచేశాడు. కోటమ్మకు లక్షరూపాయలకు చెక్కు వచ్చింది. అయితే కోటమ్మ ఆ చెక్కు మార్చుకోకుండా కోర్టువారి వుత్తరువుల కోసం లక్ష్మీనారాయణ పిటీషను దాఖలు చేశాడు.

కోటమ్మ గనుక యిప్పుడు యీ డబ్బు తీసుకుంటే వుత్తరోత్తరా తను దావాలో గెలుపొందినా ప్రయోజనం వుండదు గనుక దావా పర్యవసానం తేలేవరకూ జప్తు యివ్వవలసిందిగా కోరాడు లక్ష్మీనారాయణ

అయితే అతగాడి పిటీషను కోర్టు అంగీకరించటానికి ముఖ్యకారణం ఆ రోజున కోటమ్మ ఆ సూటువాలాతో పొరపాటున అన్నమాటలే. కోటమ్మగుండె చెరువు అయేలా విలపించింది - అన్యాయం యింగా అడంకి లేకుండా చెలరేగుతూవుంటే ఆపే నాథుడు లేడా అని విచారించింది - ఆ అసహాయురాలు

దావా విచారణకు వచ్చింది. బోనులో నిలబడిన తరువాత కోటమ్మకు యీ వ్యూహం అంతా అర్థమయింది పంతులుగాడి ఆలోచనతో ఆ సూటువాలా కోటమ్మ యింటికి వచ్చి ఆ రోజున తను పజిలు కట్టిన డబ్బు యెవరిదో ఆ వచ్చిన ప్రయిజు యేవిధంగా ఖర్చు పెడుతుందో ఆరాగా కనుక్కుపోయింది యీ రోజున తన గొంతు నులమటానికే అని తెలుసుకొంది కోటమ్మ

లక్ష్మీనారాయణ తరఫు ప్లీడరు చేతులు తిప్పుకుంటూ ఘాటుగా చెప్పాడు ఆర్గ్యుమెంటు. ఆ మొత్తం భర్త సొమ్మే అని కోటమ్మ వప్పుకుంది. ఆ డబ్బు తన క్లయింటుకు రాకుండా ఆపేస్తాననీ చెప్పింది అందువల్ల తన క్లయింటు కోరే పరిహారాలన్నీ రావలసిందే అని నిక్కచ్చిగా చెప్పేశాడు. కోటమ్మకు యేమీపాలుపోలేదు. ఇంత ప్రయాసపడగా చేతికి యేమీఁ అందదేమోననే అనుమానం కలగగానే రాజీకోసం ప్రయత్నించింది. అయితే లక్ష్మీనారాయణ ప్లీడరుతో ఆలోచించి యీ పరిస్థితుల్లో రాజీకి తాను సుతరామూ వప్పుకోననీ, ఆస్తి అంతా తనపేర హక్కువిడుదల దస్తావేజు వ్రాసి యిస్తే ఖర్చులు మాత్రం తగ్గించగలననీ నిష్కర్షగా చెప్పేశాడు

అంతతో రాజీమీద ఆశ కూడా వదులుకుంది కోటమ్మ తీర్పుచెప్పే రోజున కోర్టు ముందర నిలబడి రెండు చేతులూ జోడించి పరమేశ్వరుడితో మొరపెట్టుకుంది—యీ దావాలో నెగ్గేటట్లయితే సరాసరి కనకదుర్గను దర్శించి, వారం తిరక్కముందే వెండితోడా వేయిస్తానని.

తీర్పు చెప్పారు కోటమ్మ గెలిచింది కనకదుర్గ కరుణించింది. వారసుడికి వివాద ఆస్తిలో ప్రస్తుతం యెట్టి హక్కూ లేదనీ, అతనికి వున్న హక్కులు విధవ మరణానంతరమే స్థిరపడగలవనీ తీర్పు వ్రాశారు జడ్జీగారు.

తీర్పు సంగతి తెలియగానే కోటమ్మ సంతోషంతో అరిచింది—

"సత్యం గెలిచింది—కనకదుర్గ కరుణించింది జయా కనకదుర్గా"

కోటమ్మను చూసి తిట్టుకుంటూ బయటపడ్డాడు నాలుగువేల రూపాయలు ఖర్చు చేసిన లక్ష్మీనారాయణ

కోటమ్మ మాటతప్పలేదు. సరాసరి కనకదుర్గను దర్శించింది.

"తల్లీ లోకమాతా నీ దయవల్ల బయటపడ్డాను. శుక్రవారం మళ్ళీ యీరోజుకి నా మాట నిలబెట్టుకుంటాను." అని సాష్టాంగపడింది కోటమ్మ.

సరిగ్గా వారంరోజులకి కోటమ్మ కనకదుగ్గను దర్శించి తనమాట తప్పకుండా నిలబెట్టుకొంది

ఆపైన కోటమ్మ నేరుగా కృష్ణవొడ్డుకి వచ్చింది. తృప్తిగా సూర్యభగవానుడికి నమస్కరించి కృష్ణలో దిగింది కోటమ్మ స్నానమాడేందుకు.

నీటిలో దిగిన కోటమ్మ బయటికిరాలేదు. ఆమె దిగినచోట సుడిగుండం వుందనే విషయం పాపం కోటమ్మకు తెలియదు

తరువాత రెండుగంటలకి ఆమె శవం పల్లెవాళ్ళు పట్టుకొని వడ్డుకు చేర్చారు

కోటమ్మ లాటరీ గెలిచింది - దావా గెలిచింది కనకదుర్గ కరుణవల్ల - అయితే ఆ సొమ్మంతా లక్ష్మీనారాయణకే దక్కింది ★

## అతను - ఆమె

(34-వ పేజీ తరువాయి)

ముంగు తెగవక్కించి రొట్టలు వేయడంలో తప్పులేదు. అడది పరాయిమగవాడిలో ఏ



విరల్ ప్రొడక్షన్స్‌వారి “కన్యాదానం'లో సురభి బాలసరస్వతి.



గోయెల్ సినీ ప్రొడక్షన్స్‌వారి "వచన్" హిందీచిత్రంలో కొత్త నటి సిలిమా.

చిత్రనిర్మాత కానటువంటి ఎ.స్ కె. పాటిల్ గార్ని ఐ. ఎమ్. పి. పి. ఎ. అధ్యక్షులుగా ఎన్నుకోవడం సినిమా చరిత్రలో ముఖ్యమైన సంఘటన. బొంబాయి కాంగ్రెసు అధినేత, ఫిలిం విచారణసంఘ మాజీ అధ్యక్షుడు, మాజీ మేయరు అయిన పాటిల్ గారు బొంబాయి ఫిలిం పరిశ్రమకు నాయకుడు కావడం చాలా ఆశాజనకంగా ఉన్నది. ప్రస్తుతం పరిశ్రమలో వైషమ్యాలు, విభేదాలు, నిర్మాతల, తరల స్వార్థప్రవర్తనము ఎక్కువగా ఉన్నాయి.

ప్రొడ్యూసర్స్ గిల్డ్‌లో 9 మంది సభ్యులున్నారు. శాంతారాం (రాజ్‌కమల్), తులారాం జలాన్ (ఫిల్మిస్తాన్), సొహ్రాబ్ మోడీ (మినర్వా), బి. ఎన్. సర్కార్ (న్యూథియేటర్స్), రాజ్ కపూర్ (ఆర్. కె. స్టూడియో), మెహబూబ్, ఎ. ఆర్. కర్దార్, విజయభట్ (ప్రకాష్), మరి ముగ్గురు చిన్న నిర్మాతలు ఈ సంఘంలో సభ్యులు. పబ్లిసిటీ ఖర్చును బాగా తగ్గించడం, తమ చిత్రాలకు థియేటర్లను సంపాదించడం, ప్రభుత్వానికి సుముఖమైన ఆశయాలతో వ్యవహరించి ప్రభుత్వ సహాయాన్ని పొందడం గిల్డ్ లక్ష్యాలు. ఇదివరకు వీరు ఐ ఎమ్ పి పి ఎ లోనే ఉండేవారు కాని ఆ సంఘం దాక్షిణాత్య నిర్మాతయైన ఎస్. ఎస్. వాసన్ గారి వైపు మొగ్గుచూపడంతో, ప్రముఖ నిర్మాతలు కొందరు తమ స్థితి బాగాలేదని భావించి ప్రొడ్యూసర్స్ గిల్డ్ ఏర్పరచుకొన్నారు. ఈగిల్డ్ ఫిలింపరిశ్రమకు ప్రాతినిధ్యంవహించగల సంఘంకానేకాదు కాని మహారాష్ట్రుడైన శాంతారాం గిల్డ్‌నాయకుడు కావడం వల్ల, యూనియన్ మంత్రి డా॥ కేస్కార్ కూడా మహారాష్ట్రుడే కావడంవల్ల గిల్డ్ చాలా సాధించగలదని కొందరు భావిస్తున్నారు.

ఇటీవల మరొక ఆరుగురో, ఏడుగురో కలిసి ఐ. ఎమ్. పి. పి. ఎ. లోంచి బయటికి వచ్చేశారు ఆ సంఘానికి ఏటేటా జరిగే ఎన్నికల ఫలితాలు తమకు వ్యతిరేకంగా ఉండడం గమనించి, అంతవరకూ ఎంతో శ్రద్ధగా పనిచేస్తున్న ఈ నిర్మాతలు కొద్దిమంది రాజీనామాలిచ్చి బయటికి వచ్చేశారు

వీరు "స్వతంత్ర చిత్రనిర్మాతల సంఘం" అని ఒక సంఘాన్ని స్థాపించనున్నారు. వీరు ప్రాముఖ్యంగలవారు కారు సాధారణంగా వీరు చిత్రనిర్మాణానికి డబ్బులేక ఇబ్బంది పడుతూ ఉంటారు వీరిలో ఎమ్. ఎస్. అహ్లువాలియా (ఈయనతీసిన ఫిర్దౌస్, మహాత్మ కబీర్ రెండూ నష్టపోయినవి), జైమునీదివాన్, కె. ఎమ్. ముల్తానీ మున్నగువారున్నారు

ఇన్ని చిక్కులున్నప్పటికీ ఎస్. కె. పాటిల్ గారు ఐకమత్యంకోసం విశ్వప్రయత్నాలు చేస్తున్నారు ఆంధ్ర ఎన్నికలలో తన దీక్షశక్తిని కనబరచిన పాటిల్ గారి నాయకత్వన ఐ. ఎమ్. పి. పి. ఎ. విజయాలు సాధించగలదనే అందరూ ఆశిస్తున్నారు. ఈ సంఘపు కార్యవర్గంలో సభ్యులందరూ మంచి కార్యదక్షులు వీరు కిశోర్ సాహూ (సీనియర్ ఉపాధ్యక్షుడు), కె. ఎమ్ మోడీ (ఉపాధ్యక్షుడు), గౌరీశంకర్ (కోశాధికారి), జయంత్ దేశాయ్, జె. వి. తివారీ, ఎ ఎన్ అరోరా, బిమల్ రాయ్ ఆర్ చంద్ర, ఎమ్ ఎ మద్నీ, డి. ఎమ్ పంచోలి, రూప్ కె షోరీ

* * *

జులై 31 వ తేదీన పోలిష్ రాజధాని వార్సాలో ప్రారంభమయ్యే యువజనోత్సవంలో పాల్గొనడానికి బొంబాయి ఫిలిం వ్యక్తులు కొందరు ఆయత్తులౌతున్నారు. భారతీయ ప్రతినిధివర్గంలో సంగీత రాణి లతామంగేష్కర్, గాయకుడు హేమంత కుమార్, సంగీత దర్శకుడు సలిల్ చౌధురి, నటులు బల్‌రాజ్ సాహ్నీ, శశికళ, శైరాజ్, మీనాషోరి, అచలా సచ్‌దేవ్ మున్నగువారుంటారు. ఉత్సవం 15 రోజులపాటు జరుగుతుంది

* * *

అమర గాయకుడు కె. ఎల్. సైగల్ జీవిత కథాచిత్రానికి అన్నీ సన్నాహాలూ పూర్తయినాయి కలకత్తా, న్యూథియేటర్స్ స్టూడియోలోనే బి. ఎన్. సర్కార్ ఈ చిత్రంనిర్మిస్తారు. చండీదాస్, దేవదాసు, ప్రెసిడెంట్, జిందగీ, లగన్, దుష్మన్ మున్నగు సైగల్ చిత్రాలు ఈ స్టూడియోలోనుంచే బయటికి వచ్చినవి - ప్రసిద్ధ దర్శకుడు నితీన్‌బోస్ ఈ చిత్రాన్ని డైరెక్టు చేస్తారు. సైగల్ మొదటిసారిగా నాయకపాత్ర ధరించి నటించిన "చండీదాసు" ను నితీన్‌బోస్ డైరెక్టు చేశాడు.

న్యూథియేటర్సువారు తీయబోయే మరొక పెద్దచిత్రం "అమర్ బాణీ". అనురూపాదేవి వ్రాసిన నవల ఈ చిత్రానికి ఆధారం దీనిలో ప్రదీప్ కుమార్, మోతీలాల్, డేవిడ్, అచలా సచ్‌దేవ్ నటిస్తారు. హేమ్‌చందర్ డైరెక్టుచేస్తారు

* * *

మద్రాసు, జెమినీ స్టూడియోస్‌లో "ఇన్సానియత్" చిత్రం ప్రారంభమైనది. దిలీప్‌కుమార్, దేవ్ ఆనంద్, బీనారాయ్,

ఓంప్రకాశ్ మొదలైన ప్రసిద్ధ హిందీతారలు నటిస్తున్నారు. సి. రామచంద్ర సంగీత దర్శకుడు.

*　　*　　*

గెండేళ్లనుంచీ ఆగిపోయిన వి. ఎల్. శంతోషి చిత్రం "పాగల్ ఖానా" ఈ నెలలో తిరిగి సెట్సుమీదకు వెళ్లనున్నది. దానిని అల్హాద్ చిత్రావారు తీసుకొని పూనా, ఓకెక్లన్ స్టూడియోలో నిర్మించనున్నారు. ఇక నాలుగో వంతుమాత్రమే మిగిలివున్నదనగా, ఈ చిత్రం ధనాభావం వల్ల ఆపివేయబడింది. భారత్ భూషణ్, సురయ్యా, మురాద్, రామ్‌సింగ్, రంజిత్ కుమారి, రాధాకిషన్, ముంతాజ్ అలీ, నిమ్మీ, నాశ్ మున్నగువారు నటవర్గం రచయిత, శంతోషి. సంగీత దర్శకుడు వసంత్ దేశాయి.

నటి, గాయకి సురయ్యాకు ప్రస్తుతం ఉన్న చిత్రం యిదొక్కటే "మీర్జా గాలిబ్" విజయవంతం అయినప్పటికీ గడచిన నెలల్లో సురయ్యాను ఎవరూ బుక్ చెయ్యనే లేదు. ఇది చాలమందికి ఆశ్చర్యకరంగా ఉండవచ్చును. ఆమెను ఇంతవరకూ కాపాడుతూ వచ్చిన గాన కౌశలం కూడా ఇప్పుడామెను కాపాడలేకపోతోంది. మరొక కారణం ఆమె స్థౌల్యం.

*　　*　　*

బిమల్ రాయ్ ఇప్పటివరకూ తమఉత్తమ చిత్రాలు తీయడానికే పేరుపడివున్నాడు. ఈసారి ఆయన బాక్సాఫీస్ విజయంకూడా పొందగల చిత్రం నిర్మించేటట్లు కనిపిస్తున్నాడు. "దేవదాసు" తారాగణం దీనికి నిదర్శనం. దిలీప్‌కుమార్, సుచిత్రాసేన్, వైజయంతీమాల, మోతీలాల్‌లలో అందరూ బాక్సాఫీస్ తారలే.

బిమల్ నిర్మిస్తున్న మరొక చిత్రం "అమానత్"లో భారత్ భూషణ్, చాంద్ ఉస్మానీ నటిస్తున్నారు. షూటింగ్ చురుకుగా జరుగుతోంది.

*　　*　　*

ఇండో అమెరికన్ చిత్రం "బొంబే ఫ్లైట్ నం. 418" దర్శకుడు రతోస్కీ బొంబాయి వచ్చాడు. ఫిల్మిస్తాన్‌వారు ఈ చిత్రం నిర్మిస్తున్నారు. డి అర్సీ, లోడర్, అశోక్ కుమార్ మున్నగువారు నటిస్తారు. నర్గీస్ యీ చిత్రంలో నటించ నిరాకరించిందని తెలుస్తోంది. ఈ చిత్రానికి అడ్డంకులేమీ లేవు. కాని ఇదివరలో డేవిడ్ లీన్, అలెగ్జాండర్ కోర్డా, ఫ్రాంక్ కాప్రా మొదలైనవారు తీయదలచిన చిత్రాలవలెనే ఇదికూడా ఆగినా ఆగవచ్చు. కాని నూటికి 90 పాళ్లు ఆగదు. ఫిల్మిస్తాన్ కంపెనీవారు గడచిన సంవత్సరాలలో విపరీతంగా డబ్బు ఆర్జించారు. వారి అనార్కలీ, నాస్తిక్, నాగిన్, జాగృతి చిత్రాలు బాక్సాఫీస్ చిత్రాలైనాయి. డిస్ట్రిబ్యూషన్‌కూడా నిర్మాతలదే కనుక కమీషన్‌కూడా వారికే వస్తుంది. ఫిల్మిస్థాన్ ఈ రోజున బొంబాయిలోకల్లా, ఆమాటకొస్తే ఇండియాలోకల్లా ధనవంతమైన సంస్థ అని చెప్పాలి. అందుచేత ప్రస్తుతపు ఇండో అమెరికన్ చిత్రం ధనాభావంవల్ల ఆగిపోయే అవకాశం ఏమీలేదు.

"హసీనా" అనే హిందీచిత్రంలో శ్యామ, హిందీనటుడు అమరనాథ్.

# ప్రేక్షకుల అభిప్రాయాలు

# "అనార్ కలి"

"అనార్ కలి" చిత్రం అద్భుతంగావుంది. అనార్ కలి పాత్రను బాగా అర్థంచేసుకుని అంజలీదేవి నటించింది నాగేశ్వరరావు, నాగయ్య, రంగారావు, చక్కగా నటించారు. సముద్రాలవారి మాటలు, పాటలు ముచ్చట గొల్పాయి ఆదినారాయణరావు గారి సంగీతం శ్రావ్యంగావుంది వేదాంతం వారి దర్శకత్వం బాగా నేవున్నది హింగీ "అనార్కలి"వలె అంతగా రాణించలేక పోయింది.

అలుగోలు భద్రరావు,
—ఏలూరు.

* * *

ఫిల్మిస్థాన్ వారి అనార్కలీని అనుసరించి అంజలీవారు తీసినా, హిందీ చిత్రం చూసిన ప్రేక్షకులకు ఈ చిత్రం అంత రక్తికట్టగు కాని మొదటిసారిగా చూసినవారికి ఈ చిత్రం బాగా నే ఉంటుంది కారణం, ఈ చిత్రం మూడుపాళ్లు చాలా పేలవంగా తీసినా చివరి ఘట్టాల్లో హిందీ చిత్రంకన్న నేర్పుగా తీశారు ముఖ్యంగా అక్బరు న్యాయవిచారణజరిపే ఘట్టంలో అక్బరుగా రంగారావు నటనను మెచ్చుకోక తప్పదు దీనిలో దర్శకుని ప్రతిభ కూడా కనిపిస్తుంది

సుందరరావు,
—గుంటూరు.

* * *

'అనార్కలీ' చిత్రం ఆశించినంత బాగా లేదు అంజలీదేవి ఆమె నటించిన అన్ని చిత్రాలలోకన్నా చాల బాగ నటించింది. కాని నాగేశ్వరరావు నటన అంజలీదేవి ముందు సరితూగలేదు నాగేశ్వరరావుకు 'మేకప్' సరిగా లేదు మీసాలు అతికినట్టునాయి రంగారావు అక్బరుగా అద్భుతంగా నున్నాడు. అక్బరు పాదుషా 'ఠీవి' అతనిలో మూర్తీభవించినట్టుంది.

ఎమ్. ఎస్. కృష్ణమూర్తి
—కొలకలూరు.

అంజలీ పిక్చర్సు "అనార్కలీ" హిందీ చిత్రానికి కాపీగా తయారయింది. సెట్టింగులు చాలా గొప్పగా వున్నాయి సలీంగా నాగేశ్వరరావు నటన అద్భుతంగావుంది. ఎస్ వి రంగారావు, నాగయ్యగార్ల నటన కూడా కడు ప్రశంసనీయం. కాని విచారించవలసిన దొక్కటే అంజలీ అనార్ గా ఎక్కువ రాణించలేకపోయింది సలీం, అనార్ ల ప్రణయ సన్నివేశాలు కొంచెం విసుగు కలిగించాయి సంగీతంలో చెప్ప దగిన గొప్పతనం లేదు

ఎమ్. వి. ఆర్. కృష్ణమాచార్య,
—బందరు.

* * *

అంజలీవారి 'అనార్ కలీ' విషాద పూరితమైన చక్కనిచిత్రం నాగేశ్వరరావు, అంజలీదేవి తమతమ పాత్రలను చాల ఉత్తమంగా నటించేరు అక్బరుగా రంగారావు, జోధ్ బాయ్ గా కన్నాంబ, మాన్ సింగ్ గా నాగయ్య, గుల్నార్ గా సురభి బాలసరస్వతి. తమతమ పాత్రలను బాగా నటించేరు.

పాటలలో 'కలిసె నెలరాజు కలువ

చెలిని' అన్నపాట ఇంపుగాఉంది. రాఘవయ్యగారి దర్శకత్వం బాగుంది. అంజలీ పిక్చర్సువారు 'అనార్కలి' వంటి ఉత్తమ చిత్రాలనుతీసి ప్రజాభిమానములు చూరగొంటారని నేను ఆశిస్తున్నాను.

జి. సూర్యప్రకాశరావు.
విశాఖపట్నం

*　　*　　*

అనార్కలీ చిత్రం అద్భుతంగావుంది. అనార్కలీగా అంజలీ నటన మెఱుగుతెచ్చినది నాగేశ్వరరావు, రంగారావు, కన్నాంబ, నాగయ్యగారలు చిత్రానికి జీవం పోశారు. మేకప్ చాలా బాగుంది. కాని బాలసరస్వతి నటన రాణించలేదు. ఆమెకు మేకప్ బాగులేదు. చిత్రంలో 11 పాటలకి 6 పాటలు బాగా ఉన్నాయి జీవసమాధివద్ద పాడిన పాట ఏమియు బాగులేదు

అంట్యాకుల జోగారావు
—విజయనగరం.

*　　*　　*

అన్నివిధాలా దెబ్బతిన్న చిత్రాలశ్రేణికి దీనిని ఒక నూతన కానుకగా భావించవచ్చును. సలీం అనార్కలీల ప్రేమ సన్నివేశాలు చాలా కృత్రిమంగా గోచరించి లైలామజ్నూ చిత్రాన్ని జ్ఞాపకానికి తెస్తాయి. ఈ చిత్రానికి జీవమన్నదేమున్నా ఉంటే అది కొన్ని సముద్రాలవారి సంభాషణలవలనే నని దృఢంగా చెప్పవచ్చు.

అక్బరుగా రంగారావు చాలా చక్కగా ఒప్పించగలిగాడు. సలీంగా నాగేశ్వరరావు, అనార్కలిగా అంజలి కూడా బాగా నటించారు. ఎటొచ్చీ నాగయ్యగారుమాత్రం తన పాత్రని సమర్థతతో పోషించలేకపోయారు. ఇక, పేకేటి శివరామ్ పాత్ర కేవలం అనవసరం.

యు. వి. సత్యనారాయణ
—విశాఖపట్నం.

*　　*　　*

'అనార్కలి' ప్రేక్షకులకు ఆశాభంగాన్ని కల్గించింది ఇందుకు ముఖ్యకారణం సంగీతం. ఆదినారాయణరావుగారు కూర్చినసంగీతం చాలా పేలవంగాఉంది. అనార్కలి సలీమ్‌లుగా అంజలి, నాగేశ్వరరావులు తృప్తికరంగాలేరు. నాగయ్య, రంగారావు, కన్నాంబలు ప్రతిభావంతంగా నటించారు. సముద్రాల మాటల, పాటల రచన మనోహరం గాను, భావగర్భితంగాను ఉన్నది ఆర్టు చాలాబాగుంది. వేదాంతం రాఘవయ్యగారి దర్శకత్వంలో అనేక లోపాలున్నాయి. ఉదా॥ సలీమ్, తండ్రిపై తిరుగుబాటు చేసినప్పుడు, జోధ్‌బాయి యుద్ధరంగానికిరావడం పెద్ద పొరబాటు!

హెచ్. శ్రీనివాసరావు
—నెల్లూరు.

*　　*　　*

అనార్కలిగా అంజలీదేవి, సలీంగా నాగేశ్వరరావు ప్రశంసనీయంగా నటించారు అక్బర్ పాదుషాగా రంగారావు, జోధ్‌భాయిగా కన్నాంబ, మాన్‌సింగ్‌గా నాగయ్య ఉత్తమంగా నటించారు సలీం తండ్రిమీదికి కత్తిదూసే సమయానికి తల్లి అడ్డుపడుతుంది. ఆ సన్నివేశము, చివరకు సలీం తల తీసివేయు సమయమున తల్లియగు జోధ్‌బాయి ప్రసంగించిన సన్నివేశము ప్రేక్షకులకు మఱపురానివి.

డి. ఎల్. నరసింహారావు,
—తాడేపల్లిగూడెం.

★

## విజ్ఞాన వీథులు

(11 వ పేజీ తరువాయి)

"జ్యోతిషము విజ్ఞానశాస్త్ర దృష్ట్యా శాస్త్రముకాదు. దానిని అతీంద్రియ శక్తులు నిర్మించి యుండునన్నది నిరూపించగల అభిప్రాయముకాదు" అని సూచింపబడినది. కాకినాడ 'సత్యం' గారు "జ్యోతిషానికీ దేవుడిమీది నమ్మకానికీ సమన్వయము కుదరదనీ గ్రహశాంతులకే జ్యోతిష ఫలశాస్త్రంలో చోటులేద"నీ సూచించారు. దీనిని వైముఖ్యమనుట న్యాయమా? ఈవిమర్శవల్ల జ్యోతిషముమీద అవజ్ఞకలిగితే కలగవచ్చును గాక. అది సహజముకాదా?

మేముగానీ ఇతర విలేఖరులుగానీ జ్యోతిషఫల సూచనలలోనూ, గ్రహఫల నిర్ణయములోనూ, రాశిప్రభావ గణితములోనూ ప్రవేశించ నేలేదు. మే మారీతిగా ప్రవేశించి (ఉదాహరణానికి) "ప్లూటో గ్రహమునకు ఈ ఫలములున్నవి అవిలేవు" అన్నవిమర్శ చేసి యుండినట్లైతే, సుబ్రహ్మణ్యశర్మగారు గాని ఇంకొకరు గాని "మీరు ఆవిషయమై పరిశోధన చెయ్యాలి" అని ఆదేశించుటసబబు. మేము జ్యోతిషము యొక్క పునాదుల నే ప్రశ్న వేస్తున్నప్పుడు "పరిశోధించకుండా జ్యోతిషమును విమర్శించకూడదు" అని ఎవరైనా మాకు ఎందుకు సూచించవలెనో బోధపడుటలేదు. పరిశోధనఅన్నది మాకు తెలిసినంతమట్టుకు కార్యకారణ సంబంధముగల వైజ్ఞానిక వస్తువులో నే కాని ఆధారములే తెలియరాని 'శాస్త్రాల'లో వీలులేదు. మమ్ములను చదువరులు 'జ్యోతిషము నిజమా' అని అడిగినారు. "వైజ్ఞానిక దృష్ట్యా కాదు" అంటిమి. అక్కడితో మాపనిపూర్తి అయినది. "జ్యోతిషానికి పునాదులు గట్టివేకలవు"అనే



వి. ఎస్. పి. వారి "ఆడబిడ్డ"లో అమరనాథ్.

## విజ్ఞాన వీధులు 

వారి జ్యోతిషపు పునాదులు పరిశోధించవలెను గాని మాకు ఆపని సూచించుట ఏమి న్యాయము? మేము జ్యోతిష శాస్త్రములోని ప్రత్యేకసూత్రములను ఎరుగము మేమువాటిని విమర్శించనేలేదు జీవితములలో ఫలములను సూచించుటకు జ్యోతిషానికి కారణకార్య సంబంధముపైన ఆధారపడిన పునాదిలేదంటిమి. పునాదినే మేము ప్రశ్నిస్తూండగా భవనపరిశోధన చెయ్యండి అని మాకెందుకు పురమాయించడము? ఆ అవసరము మాకు అక్కర్లేదు. ఆ 'శాస్త్ర'మే గాలిలో నిరాధారముగా తేలుతున్నది. దానిలో మమ్మల్ని ప్రవేశించ మనడము ఏమి న్యాయము?

ఎవరైనా 'జ్యోతిషశాస్త్రచరిత్ర' ను చర్చించినా, జ్యోతిషము ప్రారంభదశ నుండి ఇప్పటిసరికి ఈయా శాస్త్రకారులు నిర్మించిన ఈ సోపానములమీద వచ్చినది అని నిరూపించినా 'వివిధ జ్యోతిష్యపద్ధతులకు ఆధారములు ఇవి' అని ... చెప్పినా సంతోషముగా ... అంతేగాని "జ్యోతిషములో ... పోతే ఇన్నాళ్లు ఎలాగ నిలిచియున్నది? జ్యోతిషఫలాలు కొన్నైనా ఎందుకు ... పోతున్నవి?" అన్నప్రశ్నలు వేస్తేవాటికి సమాధానము ఇది: జ్యోతిషము ఎందుకు ఫెయిలవుతున్నది? మరి కొందుకు తప్పుతున్నది? ఈ శాస్త్రానికి ఆధారాలు అన్నవి ఉన్నవా? ఉంటే ఏవి?" (విజ్ఞాన శాస్త్ర స్పష్టీకరణ లేవు. వేరేమైనా) వుంటే చెప్పండి వింటాము. 

## చిట్టిప్రశ్నలకు జవాబులు

సం. దశరథరెడ్డి—సూర్యాపేట.

—చెఱువు ఎండి, తర్వాత వర్షాలకి నిండితే చేపలు రావేమో. కప్పలు వస్తాయి. కప్ప ఊపిరితిత్తులద్వారానే కాక చర్మము ద్వారా కూడా శ్వాసించగలదు. అందువల్ల మట్టి బీటికలలో ఎక్కడో అడుగున ఉండిపోయిన కప్ప శరీరముద్వారా శ్వాసిస్తూ వుంటుంది. వర్షము కురిసి చెఱువు నిండగానే ఈ కప్పలన్ని బయటికి వస్తాయి.

మట్టగిడసలన్న జాతి చేపల్ని పట్టి బజారుకి తెచ్చినా కదుల్తూనే వుంటాయిట. వాటికి శరీరశ్వాసము సాయపడవచ్చును. ఆ రకపు చేపలేమైనా కప్పలవలెనే చెరువులలో ఉంటాయేమో.

బురద నేలలో లోతుగా చేతులు పెట్టి పల్లెవారు చేపలకోసము వెతకడము చూచి వుంటారు మీరు. ఆ నేల అడుగుపొరలలో తడి ఆరకపోతే చేపలు - కొన్ని జాతులు బ్రతికి వుండవచ్చును.

యస్. సుదర్శనం. — సికింద్రాబాదు.

—శాస్త్రాలు అన్నీ మానవులు రచించినవే. అన్ని శాస్త్రాలలోనూ మానవులు రచించిన చిహ్నాలు— వారినమ్మకాలూ, వారి విజ్ఞానమూ,— కనబడుతూనే వుంటాయి. మీరు కోపపడమంటే, శాస్త్రాలలో మానవులపొరపాట్లు కూడావుంటాయి నది అని మనవి చేస్తాను. భగవంతుడే శాస్త్రాలను చెప్పినట్లయితే తప్పులువుండగలవా?

భగవద్గీతలో 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః' అని ఉన్నది. చాతుర్వర్ణాలు మానవులు సృష్టించదున్నవే మనదేశంలోనే ఉన్నాయి గాని తక్కిన దేశాలలో లేవు.

అలాగే మరొకగ్రంథంలో ముందుభూమి పుట్టి తర్వాత సూర్యచంద్రులు పుట్టినారని వుంటుంది ఇంకొకచోట ప్రప్రథమంగా ఆదిదంపతులు -కశ్యపుడూ భార్యలూ— పుట్టినారనీ వారివల్లనే మానవజాతి అంతా వృద్ధిఅయిందనీ వుంటుంది అవి నిజముకావు మానవులు ఆశాస్త్రాలను రచించబట్టి మానవుల పొరపాట్లు వస్తాయిఅందులో. అయితే ఒకహెచ్చరిక ఆశాస్త్రాలు తప్పుల కుప్పలనడములేగు మేము. విద్యార్థిచేసిన కాపీని అతడుకాపీచేసిన పొరపాట్లవల్ల కనుక్కున్నట్లు,శాస్త్రాలపౌరుషేయత్వము వాటిలో మూలమూల దూరిన పొరపాట్లవల్లకనుక్కోవచ్చునంటున్నాము అంతే. పౌరుషేయములైనంతమాత్రాన అవి గర్హ్యములా? ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, ThambuChetty St Madras

తిరగలి తిప్పే నారులు



పొలంపండా నాయిలు

